# మణిమంజరి

వాఙ్మయ యోగ
పరిశోధన
విశేష సంచిక



8

వేటూరి ప్రభాకర శాస్త్రి
మెమోరియల్ ట్రస్టు
హైదరాబాదు.

# REQUEST

1. Manimanjari is usually published and dispatched by end of February and August of every year and will be dispatched under Certificate of Posting. As limited number of copies are being published any complaints regarding non receipt can be entertained if made within 15 days of dispatch and if required, the Journal will be sent by Registered Post at Party's expense

2. Prompt Payment of Subscription is requested.

## గమనిక

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

ఇందు మిత్రవర్గ ఉదారవర్గ సభ్యత్వమును పడయుటకై మా కరపత్రమున సూచించిన గడువు తేదీ 1984 ఆఖరువరకు పొడిగించడమైనది. కనుక సభ్యులు కాగోరువారు వీలైనంత త్వరలో విరాళములు పంపి సహకరింప గోరుదుము

సభ్యత్వముతో నిమిత్తములేక మా యీ ఉద్యమమునకై తమకు తోచిన రీతిని సహాయపడదలచిన సహృదయుల తోడ్పాటును కూడా ట్రస్టువారు కృతజ్ఞతతో స్వీకరించగలరని మనవి చేయుచున్నాము.

మేనేజింగ్ ట్రస్టీ,
2-2-18/15/D/1. బాగ్ అంబర్‌పేట,
హైదరాబాద్—500 013.

# ళి మంజరి

## వాఙ్మయ యోగ పరిశోధన

(విశేష సంచిక)

సంపుటం 8 ఆగస్టు, 1984

---

## బ్రౌన్-ప్రభాకర వర్ధంతి సంస్మరణ సంచిక

---

*సంపాదకులు*

**డా॥ వేటూరి ఆనందమూర్తి**






వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

2-2-18/15/D/1, బాగ్ అంబర్‌పేట,

దేశ్‌ముఖ్ కాలనీ, హైదరాబాదు-500 013.

"మణిమంజరి"
చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ శతవర్ధంతిని
ప్రభాకరుల ముప్పైనాల్గవ వర్ధంతిని
పురస్కరించుకొని వెలువడిన
బ్రౌన్-ప్రభాకర వర్ధంతి సంస్మరణ సంచిక

విడిప్రతి : పదిహేను రూపాయలు

ట్రస్టు సభ్యులందరికి ఉచితము

వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
2-2-18/15/D/1, బాగ్అంబర్‌పేట,
దేశ్‌ముఖ్ కాలనీ, హైదరాబాదు-500 013.

ముద్రణ:
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు-500 001.

# విషయ సూచిక

# తీయని తలపులు

—ఎన్.ఎ. నారాయణరావు

*[ఈ తీయని తలపులు గురుదేవులను గూర్చిన తమ తీయని తలపులతో వారి అంతేవాసి శ్రీ నారాయణరావుగారు ఇతకూర్చి పంపినవి. ఆంగ్లకవి ఎడ్డింగ్టన్ రచనచే ప్రభావితుడై ఆనాటి విద్యార్థి యువకవి తెనిగించిన గీత రచనను వేటూరివారు విని మెచ్చి వెన్నుదట్టిన సన్నివేశమిది — సం॥]*

గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సన్నిధిలో గడపిన కాలము ఆనాటి విద్యార్థులకు జీవితాంతము స్మరింపదగినది. వారి వాత్సల్యపూర్ణ హృదయము, వైదుష్యయుత ప్రజ్ఞ, చమత్కార భరిత సంభాషణము, ఆర్జవయుక్త జీవితము ఆదర్శప్రాయములు. ప్రతి విద్యార్థి యోగక్షేమములను వారు శ్రద్ధగా పరిశీలించి పరీక్షించి వారి జీవితములకు వెలుగుబాటల నేర్పఱిచినారు. తెలివితేటలతోబాటు వారికి సత్ప్రవర్తనము నలవఱచుటకు పాటుపడెడివారు.

తిరుపతి ఓరియంటల్ కళాశాలలో తెలుగు విద్వాన్ కోర్సు ప్రారంభింపబడిన సంవత్సరమందు చేరి 5 సంవత్సరములు శ్రీ గురుదేవుల ఆదర వాత్సల్యములకు పాత్రుడనైన నేను స్మరింపదగిన సంఘటనలెన్నో యున్నవి. అందొక్కదానినిక్కడ ఉటంకించుచున్నాను.

నేను విద్వాన్ ఫైనల్ మొదటి సంవత్సరములో చదువుచున్నపుడు విద్వాన్ విద్యార్థులకు కవిత్వ రచనలో ఆసక్తి కలిగించుటకై ఒక కవితాగోష్ఠి నిర్వహింపబడినది. విద్యార్థులు పెక్కండ్రు తమ రచనల నా సమావేశములో చదివి వినిపించినారు. నేను S S.L.C. ఆంగ్ల పాఠ్యభాగములో చదివియున్న John Addington Symonds రచన A Vista అనుదానిని తేట గీతలలో అనువదించి చదివినాను మరునటి దినము తరగతిలో శ్రీ శాస్త్రిగారు కవితా

గోష్ఠి వివరముల నడిగినారు. నా రచన ప్రసక్తి వచ్చినది పద్యములను గురుదేవులకు చూపితిని. అందలి మహోన్నత భావములకు వారు ముగ్ధులై ఇంగ్లీషు పద్యములతో నా అనువాదమును చూచినారు. అనువాదము మూలానుసారముగానే యున్నది కాని ఆ భావములను విస్తృతిపఱచుట అవసరమని గేయములుగా అనువదించిన బాగుండునని సెలవిచ్చిరి.

ప్రతి దినము ఉదయం సాయంకాలము వీలున్నపుడెల్ల గురుదేవుల సన్నిధిలో నుండి గోష్ఠిలో పాల్గొనుట మా కలవాటు. ఆనాడు సాయంకాలము వారి యింటి కేగితిని. ముత్యాలసరాల పద్ధతిలో నా పద్యముల ననువదించిన బాగుండునని తెలిపి రచనకు శ్రీకారము చుట్టిరి. రచన చాల వరకు వారిదే. అనువాదము పూర్తియైన పిదప ఆ గేయములను తాము మనశ్శాంతికై అప్పుడప్పుడు చదువుకొందునని వ్రాసి యిమ్మనిరి. అట్లే వ్రాసి యిచ్చితిని.

శ్రీ శాస్త్రిగారు మదరాసు వెళ్ళినపుడు ఆంధ్ర పత్రికా సంపాదకులు ఉగాది సంచికకు తమ రచన నీయవలసినదిగా అభ్యర్థింప తమ రచనను తరువాత పంపుదుమని చెప్పి తమ యొద్దనున్న గేయముల ప్రతిని వారి కందజేసి వానిని ఉగాది సంచికలో ప్రకటింపుమని చెప్పిరి. అది 1944 వ సం॥ ఉగాది సంచికలో ప్రకటింపబడెను. నేనీ రచన నంతకు ముందు 'భారతి' కి పంపియుండ అది త్రిప్పి పంపబడి యుండెను. ఆ గేయ రచనలో చాల భాగము గురుదేవులదే. వాని నీ క్రింద పొందుపఱుచుచున్నాను.

## తీయని తలపులు

1. జగతి నికనిపి తప్పకుండగ। జరుగనున్నవి యుత్తమోత్తమ
జాతి యొక్కటి వెలయు నదియును। జగమెఱుంగనిది;
దాన నెల్లర హృదయములు స్వా। తంత్ర్య తేజముతో వెలుంగును
మెఱయుచుండును వారికనుగవ। లెఱుకమెఱపులతో.

2. తప్పులన్నవె వారి చెంతల। నెప్పుడును జొప్పడఁగనేరవు
తేడు గురుడని వారికెప్పుడు। లేడు వేడికొనన్
చండశాసన కరుల యలజడి। యుండనేరదు వారి చెంతల
శాంతి సంపద సామరస్యము। చక్కఁగా సాగున్.

3. వారు వీరులు ధీరులతిబల। వంతులంతే కన్ను లెదురను
కానరోర్వరు పరులనెత్తుటి। కణమొకండైనన్
నీటిమీదను నిప్పుమీదను। నేలమీదను గాలిమీదను
వాలి సర్వాహంత్రు తమ స। ర్వాధిపత్యంబున్.

4. బల్లెములు బాకులును దాడుల। భాగ్యమే లేకుండు నత్తరి
ఎల్లదేశము లెల్లజాతులు। నేకమై వెలయున్
అఖిల హృదయములందు సుఖసౌ। హార్దనాదులె యాడుచుండును
పాఱు తియ్యనినెత్తు రేయా। పాదమస్తకమున్.

5. గడబిడలు లేకుండ నిండ్లను। గడునభిజ్ఞత కలిగి సఖులను
నడచుకొందురు వారు తమ నడ। వడి ప్రశస్తముగాన్
ఆటపాటల నీశ్వరునిమా। హాత్మ్యమే కొనియాడుచుందురు
గుళ్ళ గొప్పనగళ్ళ నెడనెడ। గూడి వేడుకతోన్.

6. తీర్థముల నుద్యానవనముల। దేవళంబుల నారుబయళుల
స్త్రీలు పురుషులు నందుయువకులు। బాలకులు వృద్ధుల్
కూడియాడి సమస్త విద్యల। గూర్చి చర్చల సలుపుచుందురు
నేర్చుకొందురు వారు తమ తమ। కూర్చు విద్దియలన్.

7. కూర్మిగృహపతియేకమై సహ। ధర్మచారిణితో సుఖించును
రాణియై సతి పతికి దేహము। ప్రాణమర్పించున్
కడుపు చల్లని తల్లిదండ్రులు। గా రహింతురు వారు సంతతి
పడసి సుఖనైర్మల్యములు ముడి। వడెడు కనుబొమలన్.

8. జగములరిగెనుగాని యింతకు। జగతి మానవజాతి యెఱుఁగదు
సగముసగమే గుర్తెఱింగిరి। సత్కవీశ్వరులున్
సచ్చిదానంద ప్రదీపము। సకలజన హృదయాంగణంబుల
నిత్యమై స్నేహార్ద్రమై యిక। నిలిచి వెలుగొందున్.

9. ముద్దుగూనల నవ్వుమోముల। మురిపములవలెఁ దియ్యతియనై
అద్దములవలె నలరు మనముల। నఖిల మానవులున్
ఒద్దికంగవకూడి తార। న్యోన్యమును సుఖయించుచుందురు
తద్దయును భగవద్గుణ స్తుతి। తత్పరత్వమునన్.

10. సర్వవిద్యలు నూత్న తేజము। పర్వియభ్యున్నతిని గాంచును
హాయి యని గేయములు నుచ్చ। స్థాయిలో సాగున్
దేవలోకమువోలెఁ గడు సం। తృప్తి గొల్పును మర్త్యలోకము
జీవితమె యొక గేయరచనము। గా వినోదమిడున్.

11. చీకుచింతలు లేకపోవును। సిగ్గు లెగ్గులు సమసిపోవును
లేకితనములు లేకపోవును। లేవు పాపకృతుల్
కాక యొక్కొకవేళ నెపుడే। కలిగె నేనియు నవియు మేలే
చేకుఱంగాఁజేయు నీశ్వర। సిద్ధిహేతువులై.

12. భ్రమముగాదిది స్వప్నవృత్తాం। తమునుగా దత్యంత సత్య
క్రమముగా నికమీద జగమున। కలుగనున్నవియే
మనము చూతుమొ చూడమో మన। తనయులైను చూడనేర్తురు
కనుటకే యాసింత మా బం। గారు కాలంబున్.*

# స్మృతి

—బయిరెడ్డి సుబ్రహ్మణ్యం

*[ఇది ఒక విద్యార్థి స్మృతి. ప్రభాకర గురుదేవుల కరుణచే ప్రేరణచే ప్రభావితుడై ఈ విద్యార్థి కవియై గాంధీశతకము, వెంకటేశ్వర సారస్వత వినోదిని మొదలైన కృతులను రచించెను–సం॥]*

నేడు సర్వతోముఖ విద్యావకాశాలున్న పట్టణములలో తిరుపతి పట్టణమొకటి. ఇచట విద్యాభ్యున్నతికి ముఖ్య కారణం విశ్వవిద్యాలయము. అయితే విశ్వవిద్యాలయ స్థాపనకు ముందు ముందే తిరుపతి విద్యోన్నతిని సూచించే సంవత్సర మొకటి కద్దు. అదియే 1939 వ సంవత్సరము.

చాలా కాలంగా వుంటూ వచ్చిన తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో దేవస్థానము వారు పై 1939 వ సంవత్సరములో సంస్కృతముతో బాటు తెలుగు, తమిళము, ఆ తర్వాత హిందీ విద్వాన్ కోర్సులను ప్రవేశపెట్టి, పై సంస్కృత కళాశాలను ప్రాచ్య కళాశాలగా మార్చిరి. అంతియే గాక బంగారునకు సువాసన గూర్చినట్లు అప్పుడే ప్రాచ్య కళాశాలకు వేనకువేలు ప్రాచీనార్వాచీన గ్రంథములు గల ఒక పెద్ద పరిశోధనా సంస్థను తిరుపతి తిరుమల దేవస్థానమువారు అనుబంధముగా జేసిరి.

ఇట్లు తిరుపతి విద్యాభ్యుదయ పథములో ప్రవేశించిన కారణమున అందుకు తగిన పండిత దిగ్దంతుల అవసరము దేవస్థానమునకు కలిగెను. అట్లు ఆ సమయమున దేవస్థాన విద్యారంగములో ప్రవేశించిన సంస్కృతాంధ్ర తమిళ హిందీ పండిత ప్రకాండులలో గురుపర్యులు కీర్తిశేషులు వేటూరి ప్రభాకర శాస్త్రి గారొకరు.

అంతకు పూర్వము మదరాసు ప్రాచ్య పుస్తకభాండాగారములో ప్రాచ్య పరిశోధకులుగా పనిచేసి, శతాధిక గ్రంథ పరిశోధనలు సల్పి, పీఠికలు వ్రాసి

సుప్రసిద్ధ విద్వన్మణిగా ప్రకాశించిన సార్థక నామధేయులు ప్రభాకరశాస్త్రి గారు 1940 లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో ఆంధ్రశాఖాధ్యక్షులుగా పదవి నలంకరించి, మా బోంట్లకు తమ పరిచయభాగ్యము కల్గించిరి.

శాస్త్రిగారు పాఠములు బోధించుచున్నపుడు సందర్భానుసారముగా, సమయోచితముగా వారు దృష్టాంతీకరించి చూపే సాహిత్యాంశములు వింటూ వున్న విద్యార్థులకు తరగతిలో నున్నట్లుగాక ఒక పెద్ద గ్రంథాలయములో నున్నట్లు, వివిధ గ్రంథావలోకనము చేయుచున్నట్లు తోచెడిది

ప్రిన్సిపాలు స్వర్గీయ పరవస్తు రామానుజస్వామి M A. గారు మొదలు కళాశాల అధ్యాపకులకేమి, విద్యార్థులకేమి శాస్త్రిగారి పట్ల ప్రత్యేక గౌరవ ముండెడిది.

అధ్యాపకులలో నొకరైన పాతాళభేది సుబ్రహ్మణ్య కవిగారికి ఉదయము కళాశాలలో అడుగుబెట్టిందే మొట్టమొదటి నిత్యకృత్యమేమనగా శాస్త్రిగారున్న చోటికి లేదా వారున్న తరగతికి పోయి, వారికి నమస్కరించిపోవుట.

అధికార వర్గములో కూడ శాస్త్రిగారి యెడల నిండు గౌరవాదరము లుండేవి. బండి శ్రీహరిరావు నాయుడుగారు దేవస్థాన కమిటీ అధ్యక్షులుగా నున్నప్పుడు ఒకరోజు హఠాత్తుగా శాస్త్రిగారి విద్వాన్ తరగతికి వచ్చిరి. శాస్త్రిగారు లేచి అధ్యక్షులవారిని గౌరవించిరి. అధ్యక్షులవారు "మీరు అట్లనే కూర్చొండి, కూర్చొండి" అని మళ్ళీ మళ్ళీ సూచించి తాము డెస్కులపైననే విద్యార్థులతోబాటు కూర్చొనిరి. కొన్ని యోగక్షేమములతోబాటు సందర్భవశమున "అర్జునకున్న పేర్లేవి? అవి యెట్లు వచ్చినవి?" అని తెలిసికొనగోరిరి. శాస్త్రిగారు వెంటనే "అర్జునః ఫల్గునః పార్థః" అను కోశము నుదాహరించి, ఒక్కొక్కదాని వ్యుత్పత్తి వివరించి చెప్పిరి. నాయుడుగారు విని ఆనందించి సెలవు దీసుకొని పోయిరి.

సందర్భానుసారముగా తరగతులలో పూర్వకవుల పద్యాలు, సొంత చాటువులు శాస్త్రిగారు ఎన్నో వినిపిస్తూ విద్యార్థులను భ్రమరకీట న్యాయముగా విద్యావంతులను కావించేవారు. వారివద్ద విని జ్ఞప్తిబెట్టుకొనియున్న కొన్ని పద్యములు మచ్చుకు మనవిచేస్తాను.

ఉ॥ ఊహ గలంగి జీవనపుటోలము నంబడి - పోతన భాగవతము

క॥ నలుగాలివానగోవును (పవిత్రము) - తిక్కన భారతము

ఉ॥ సీతలపేనుగంటి - తిక్కన భారతము

ఉ॥ ఆద్యంతము లేని భోజనము - మొదట వడ్డించే నేయి, కడపట వడ్డించే మజ్జిగ - రెండూ లేని తిండియని యర్థము - శ్రీనాధుని చాటువు.

మ॥ పసుపేమేయన ముద్దరాలొకతె - శాస్త్రిగారి మూన్నాళ్లముచ్చట గ్రంథము.

ఉ॥ చేరువదుర్లభంబు - శాస్త్రిగారి చాటువు.

పైరీతి శ్లేషార్థములు, వ్యంగ్యార్థములు, హాస్యము, నీతి, తత్త్వము గల కావ్యఖండికలను, సాహిత్య విశేషములను వినిపించి వారు విద్యార్థులను రంజింప జేసేవారు. పద్యముగాని, పాటగాని శ్రుతిపేయముగా వినడమంటే శాస్త్రిగారికి మిక్కిలి యిష్టము. తరగతులలో కొన్ని ప్రత్యేక సందర్భములో భాగవతాది గ్రంథ పద్యములు విద్యార్థులనుండి వినగోరేవారు : విని ఆహ్లాదించువారు.

ప్రభాకర శాస్త్రిగారి జీవితంలో తాళ్లపాక అన్నమాచార్య కృతులను ఆవిష్కరించు కార్యక్రమ మొక ముఖ్య ఘట్టము.

అన్నమాచార్య సాకల్యతావిష్కరణమునకు నడుంగట్టిన శాస్త్రిగారు కేవలము ఆ కృతులను పరిశోధించడము, పరిష్కరించడము, వాటికి ముద్రణ రూపము గల్పించడముతో తృప్తిపడక కంకణమును మణితో శోభింపజేసినట్లు ఈ పరిశోధన కార్యక్రమముతో అన్నమాచార్య జయంతులను కూడ నాడు జోడించి నాంది పలికిరి. ప్రయోగాత్మక ప్రయోజనాత్మక సన్నివేశము. ఈనాడు తిరుపతిలో, అన్నమాచార్య కళామందిరములో అన్నమాచార్య సాహిత్య వృక్షము శాఖోపశాఖలుగా విస్తరిస్తూ వున్నదంటే దానికి బీజము వేసినవారు ప్రభాకర శాస్త్రిగారే

తిరుపతిలోని సీతారామవిలాస భవనములో శాస్త్రిగారు ఆ దినములలో యోగసాధన కూడ చేస్తూ, ఎందరికో ఆర్తులకు ఆరోగ్యభాగ్యము కల్గిస్తూ వుండేవారు.*

# అస్తమయం

—డా॥ పోచిరాజు శేషగిరిరావు

*[గురుదేవులు శ్రీ ప్రభాకరు లస్తమించినపుడు తూ॥ గో॥ జిల్లా అనపర్తిలో జరిగిన స్థానిక సంతాప సభలో 3-9-1950న చదివినవి. —రచయిత]*

రసమయమైన మీ హృదయ రమ్య సరోవరమందు హంసనై
మసలిన నాటి దృశ్యములు మర్మములన్ గదలించి వైచుచున్
విసపు కణమ్ము భాతి పరివేదనముం గలిగించి నా హృదిన్
మసిగ నొనర్చుచున్నయవి మాటికి మాటికి జ్ఞప్తి వచ్చుచున్.

చెళపిళ సత్కవీశ్వరుని శిష్యులలో తలమానికంబవై
వెలిగి, తెలుంగు భారతికి వేయి విధంబుల సేవచేసి, యు
జ్జ్వల కమనీయ కీర్తిసుమ సౌరభముల్ వెలయించి శాశ్వత
మ్ములగు విభూషణమ్ములను మూర్తిలఁజేసితె! శ్రీ ప్రభాకరా!

త్యాగమె జీవితమ్మునకు తారక మంత్రముగా గ్రహించి, ఉ
ద్యోగము నందు సైతము నితోధిక సేవ యొనర్చి - నిత్యమున్
భోగము లన్నిటిన్ విడిచి పుణ్యపథమ్మున సంచరించితే
యోగివరేణ్య! సద్గుణ మహోదయ! దివ్యలసత్ ప్రభాకరా!

నరనరమందు మీ అమృతనాద సుధారసమే స్రవింప స
త్వరముగ మా హృదుల్ దురితపంకిలమార్గము వీడి - ఏ మహో
త్తరమగు లోకమో కనఁగ తారసిలున్ - భవదీయ సత్కటా
క్షరమకె వచ్చెనే విలయ కాలము లోకము జర్జరింపఁగన్,

అస్తమయం : శేషగిరిరావు

ప్రకృతి సమస్తమున్ మఱచి పాదసరోజము లంటు వేళలున్-
వికృతి యొకింతలేక రసవీథులఁబోవు విహార వేళలున్-
సకలము నీవెయంచు విలసన్మతితో వచియించు మా నుడుల్
వికలములయ్యెనేఁడు సుకవీంద్ర శిరోమణి! వేదవిద్ఘృణీ!

సంతరించితి తెల్గు సాహిత్య లక్ష్మికి
ఖండ కావ్యంబుల కాన్కలెన్నొ
నిర్మించితివి నీతినిధి వంటి గ్రంథమ్ము
నాంగ్లమ్మునందుండి యనువదించి
ప్రాకృత భాషా సరస్వతిన్ భజియించి
హాలునిగాథార్థ మంద్రభాష
తమిళ సాహిత్య విద్యా రహస్యముఁ దెల్పు
పాశురంబుల తెల్గు బాసలోని

కనువదించిన మేటి విద్యా తపస్వి!
'తెలుఁగు మెఱుఁగులఁ' జూపు సుధీవతంస
భాసకృతితతి తెల్గించు ప్రాజ్ఞమూర్తి!
తొలఁగినాఁడవె తెల్గుల పొలము వీడి.

కవితావల్లరి మీ హృదిన్ జిగిరిచెన్ ఖండ స్వరూపంబుతో
చవులూరన్; మొదలింటివాఁడవు విమర్శవ్యాస సద్వీథిలో,
కవిరాట్ శేఖర సచ్చరిత్రలను నద్ఘాటించినా వింపుగా,
అవురా! ఏగితె తెల్గు వీడుచు మహాత్మా! తెల్గు భండారమా!

బాసను గల్గు నక్కరములన్ బరియించి విమర్శ దృష్టితో
వ్రాలను దెల్గుబాసను పరామరిసించి, చరిత్రహీనులన్
దేలిచి నిల్పినావు - ధరణీవిభులందఱనిట్లు - జాతికిన్
మేలొనగూర్చినావు - అవనిన్ నినుబోలు రసజ్ఞుఁడుండునే!

అమృతత్వమ్మును సత్యమున్నిలుప నాహరించుటల్ మాని, దే
హము సౌభాగ్యము నెంచకే. విమల సత్యాచార సంపన్నతన్
తమముంజీల్చి వెలుంగు చూపు గురు పాదమ్ముల్ పడింజేరి, ఆ
అమరత్వమ్మును పొందనేగితె! మహాత్మా! ఆర్తచింతామణీ!

జగము నుఱ్ఱూత లూగించు మగతనమ్ము!
జ్ఞానకిరణమ్ము చూపు ప్రజ్ఞా మహత్తు!
కలుగు మా గురుదేవుల కంజలింతు
అశ్రుకణములు రాల్చుచు నహరహంబు.

సరసత్వమ్ము విశాలమౌహృదియు - ప్రజ్ఞాభాసురమ్మున్ గుణో
త్కరమున్-ధార్మికచింత-లోకమునకై కష్టించుటల్ గల్గు మా
పరమూర్తిన్ హరియింప గంటిమిటు, దుష్కాలమ్ము ప్రాపించెరా!
అరరే! ఎంతటి చండశాసనుఁడవోరా! దుర్విధీ! ఇయ్యెడన్.

పరమామ్నాయి రహస్యముల్ సరసభావ ప్రౌఢిమై దెల్ప ను
ర్వర జన్మించిన ఆదిశేషుఁడవుకావా? నీవు, వేత్తైనచో
వరతత్త్వార్థ గభీర భావములు విద్వన్మానసానందమై
పరగంజేయ గలాఁడవే! విమల భావావేశ! విద్వన్నుతా!

హృది నవనీత మంచు వచియించిన చాలదు - పల్కుపల్కునం
దుదయమునొందుగా మధురసోత్కటధారలు సంతతమ్ము - అ
భ్యుదయపుటూహలే నిరతమున్ జరియించు మనోబ్జమందు - నిం
పొదవ పరోపకారమె మనోహరమై కనుపట్టు మీ యెదన్.

సాక్షాత్కారము చేసి చూపఁగల
ప్రజ్ఞాధీర! యోగీశ్వరా!
దీక్షా కంకణమున్ ధరించితి
రక్షసేయంగ - స

అస్తమయం : శేషగిరిరావు

ద్వీక్షన్ రోగము లెల్లఁ బాపితి
ప్రభూ! వీక్షింప రావేలొకో!
చక్షుఃప్రీతియొసంగ, హా!
మలఁగె నాశాజ్యోతి శిష్యాళికిన్.

*[శ్రీ ప్రభాకర గురుదేవుల అంతేవాసులలో పోచిరాజువారు ప్రముఖులు. ఆంధ్ర విశ్వవిద్యాలయమున 'ప్రభాకర సారస్వత పరిశ్రమ' అను పరిశోధన వ్యాసమును సమర్పించి డాక్టరేట్ పట్టము నందుకొన్న విమర్శకుడు, పండితుడు, కవి శేషగిరిరావు గారు.*

*1950 లో ప్రభాకరు లస్తమించినపుడు పోచిరాజువారు ఘటించిన శ్రద్ధాంజలి ఇది. —సం॥]*

''స్నేహితులెల్ల శత్రువులు చేసిన సత్కృతులాలకించి యు
త్సాహముగొల్పఁగాదగు విదగ్ధులు గానగరారు చేయు స
న్నాహము లెన్నియో గలవు నాలుక దాటదు వాని లబ్ధి యీ
యైహిక మిట్టులుండె పరమార్థమునేని లభింప దయ్యయో''

—వేటూరి ప్రభాకరశాస్త్రి గారి చాటువు
[రచనా కాలం 1927.]

''ఇంక నేను చేయగలిగినదేమీలేదు
అంతా యేదో మీరే చేయాలి''

# తిమ్మావజ్ఝల వారి లేఖ

సేకరణ

— డా॥ పోచిరాజు శేషగిరిరావు

ప్రియ మిత్రులకు

నమస్కారములు

శ్రీ గురుదేవుల యస్తమయము మన కందఱకు ఒక పెద్ద దెబ్బ. ఇట్టి యపాయము మన కొనఁగూడునని నేనెన్నడు తలఁపలేదు. కాని అనుకోని సంఘటన జరగినది. ఆకు చాటు పిందెలుగా కాలము గడపుచుండిన మనకు ఒడిలో తలదాచుకొని మన కష్టసుఖములు చెప్పుకొని అవ్యయానందము పొందు నదృష్టము మనకు లేకపోయినది. దౌర్భాగ్యుఁడను! అవసాన కాలములో నైనను వారి కడ లేకపోయితిని. వారి తుది దర్శనము కూడ లభింపలేదు. మధ్యాహ్నము రెండు గంటలకు వారి నిర్యాణవార్త విని తొమ్మిది గంటలకు మెయిలెక్కి ఒంటి గంటకు తిరుపతికి పోవుసరికే దహన సంస్కారము జరగిపోయినది. మూడు వందల మైళ్ళ దూరములో నుండిన నీవు, ఎనుబది మైళ్ళ దూరములో నుండిన నేను వారి దర్శన భాగ్యము పొందక పోవుటలో సములమైతిమి. వారు అంతరించినను వా రంతరించినట్లే నాకుఁ దోచుటలేదు. తిరుపతిలో వారున్నట్లే నా భావన. తిరుపతికిఁ బోయినప్పుడు వారి స్థానములో నెవ్వరు లేకపోయినను వారున్నట్లే భావన. దొడ్డికి వెళ్ళి యున్నట్లో, గ్రామాంతరము వెళ్ళి యున్నట్లో భావించి మనసు తనంత నా ప్రదేశమునకు వినయముతో నమస్కరించును. ఆ గదిలో కూర్చుని మాటలాడుచుండినను కూడ వారు లేరని,- పరమపదించిరని భావపు బుడగలు పొడముచున్నను- వారున్నప్పటి వలెనే స్వతంత్రముగా, విచ్చలవిడిగా మాటలాడుటకు జంకుగానే యుండినది. వారున్నారనియే యనుట కింతకంటె ప్రబల దృష్టాంతము లేమికావలెను?

వారి యవసానమున కారు నెలల నుండియే వారి శరీరములో నేదో యావేదన యెక్కువగా నుండినది. ఏవో అవీ, యివీ అన్ని కార్యములూ చేయ వలయునని, త్వరలో ముగింప వలయునని వారు ఉద్వేగపడుచుండిరి. కాని యప్పుడనుకొనెగి వాఁడను 'సాహిత్యములోగాని, ఇతర విషయములలోఁగాని యింత యాందోళన, యుద్వేగము చెందెడివారు కారే! ఎందు కింతగా నీ వయసులో నుద్వేగపడు చున్నా'రని. నేఁడు జూడగా నర్థమగుచున్నది వారి యవసాన విషయము వారికి ముందుగనే తెలిసినట్లున్నది. అందుకనియే తామేవో కొన్ని కార్యములను చేసిపోవలయునని వారు తొందరపడుచుండిరి కాబోలునని యూహించు చున్నాఁడను వారి యవసానమునకు ఇరువది రోజులకు ముందు వారు మదరాసునకు వచ్చియుండిరి. చాటుపద్యమణిమంజరికై వారు సేకరించిన సేకరమును నా చేతికిచ్చి యచ్చు పనులు చూడమనిరి. అన్ని చూడగలను గాని 'బిరుదములు' భాగము ప్రూఫ్‌లు మీరేచూచిన నిర్దుష్టముగా నుండగల దంటిని. అప్పుడు వారు చెప్పిన మాటలు ఇంకను మ్రోగుచున్నవి. 'ఇంక నేను చేయగలిగినదేమీలేదు. అంతా యేదో మీరే చేయాలి. ఏదో నువ్వేచూచు' అని. ఈ వాక్యాలలో ఏదో ఒక హెచ్చరిక వారు చేసినారనే నా భావన. త్రాడు తెగిన బొంగరముల వంటి వారమైనాము శ్రీ శంకరశాస్త్రిగారు 'ధన్వంతరి' పత్రికలో వ్రాసినారు. "ప్రభాకరుఁ డస్తమించి దివాకరుఁ డుదయించునట్లు నేఁడు ప్రభాకరుఁడస్తమించినా ప్రజ్ఞా ప్రభాకరుఁ డచిర కాలములోనే యుదయింపఁగలఁడని మా యోగ మిత్రమండలి యెదురు చూచుచున్నది"- అని, మనమును అట్లే యెదురు చూచుచుందుము. తిరుపతిలో సాయం ప్రాతస్సమయములలో ప్రార్థనములు మామూలుగానే జరుగుచున్నవి. వారున్నప్పటివలెనే ప్రార్థనాదికములు నిర్వర్తింపఁబడుట మన కందఱకు సంతోష విషయము. మామూలుగా నక్కడికి వచ్చువారు అక్కడికి వచ్చుచున్నారు.

నీ మిత్రుడు

**తి. కోదండరామయ్య.**

*[ఈ లేఖలో మిగిలినవి ఏవో చిల్లర విషయాలు. వాటి ప్రసక్తి అవసరముండదని వదలివేసినాను. పైది యథాతథపు నకలు. —పోచిరాజు శేషగిరిరావు ]*

# అందఱు చదువవలసినది

అవమానింపకు మెవని, న
తివాదముల యందుఁ గడుఁ దితిక్షింపుము, నా
శవశమపు నీ శరీరపుఁ
దవులన శత్రుత్వమూనఁ దగ దెవ్వానితోన్.

—వేటూరి ప్రభాకరశాస్త్రి.

[‘అందఱు చదువవలసినది’ అను గుర్తుతో “అతి వాదాం స్తితిక్షేత-నావమన్యేత కంచన। నచమందేహ మాశ్రిత్య-వైరం కుర్వీతకేనచిత్॥’ (మను॥) శ్లోకమునకు శాస్త్రిగారి తెనిగింపు వారి ‘కలగూరగంప’ నోట్సునుండి సేకరించినది రచనా కాలం - 1927. —సం॥]

## బ్రౌన్ వాఙ్మయ పరిశోధనకు ప్రభాకరులే ఆద్యులు:-

# ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము

హైందవ సారస్వతమునకు గనియని చెప్పదగు చెన్నపురిలోని ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గల విషయరత్న విశేషములు ప్రపంచమునకు దప్పక వెల్లడి కాదగినవి. మెస్తరు మెకంజీ, బ్రౌన్ అను నాంగ్లేయులు మనకు జేసిన మహోపకారము మఱవరానిది పత్రికాధిపతులును, భాషాభిమానులును నిందలి విషయములను వెలివుచ్చ బ్రాధించుచు విలువబట్టి యప్పుడప్పుడు కొన్ని కొన్ని చిన్ని చిన్ని యుపయుక్తాంశములను వెల్లడింప దలంపుగొని ప్రస్తుత మిద్దానిని వ్రాయించి పంపితిని. బ్రౌన్, మెకంజీ దొరలు వ్రాయించిన వ్రాతలు భాషా విషయమున సంపూర్ణ సంస్కారమందనివైనను (అందమిచేతనే కాబోలు) పసిబాలునకైన నర్థమగునట్లు తేటతెల్లముగ నుండును. అట్టివానిని మన మతికౌశలమును జూపి సంస్కరింప బూనిన సులువుగా నర్థిణము కాకపోవునేమో యను తలంపున నున్న దున్నట్లే వ్రాయించి పంపగవగిలిని

చెన్నపురి, వేటూరి ప్రభాకరశాస్త్రి

4-3-1911

[ఈ లేఖను శ్రీప్రభాకరులు కృష్ణాపత్రికాధిపతులకు 4-3-1911న వ్రాసినారు. వారు ఈ లేఖతోపాటు ప్రభాకరులు వ్రాయించి పంపిన "ఎఱ్ఱగడ్డవారి పోరాటము" అను వచన భాగమును ఏప్రెల్ 7వ తేదీ కృష్ణాపత్రికలో ప్రకటించిరి.

మెకంజీ, బ్రౌన్‌దొరల వాఙ్మయ సేవను గూర్చిన పరిశోధనకు మన దేశంలో శ్రీకారం చుట్టి ఆహ్వానం పలికినవారు ప్రభాకరులే. ఆ పని వారి యీ లేఖతోనే ఆరంభమైనది. —సం॥]

## ఎఱ్ఱగడ్డవారి పోరాటము

నల్లసిద్ధదేవ చోళమహారాజు నెల్లూరి పట్టణమందు సింహాసనారూఢుండై పృథ్వీసామ్రాజ్యం చేయుచుండగాను వారివద్ద రణతిక్కన్న అనే బ్రాహ్మణుడు సేనాధిపతి ఇతనికే ఖడ్గతిక్కన్న అని పేరు కలదు. అప్పుడు యాదవ వంశోద్భవుండైన కాటమరాజు. ఇతని పినతండ్రి పోలమరాజు. ఈ పోలమరాజు కుమారుడు కరి అవులరాజు వీరు లంకమల పాలకొండ నల్లమల మొదలయిన పర్వత ప్రదేశములందు అరణ్యములో పచ్చిక పట్లను తమ యొక్క విస్తారమైన గోగణమును సంరక్షణ చేసుకుంటూ నల్లసిద్ధ చోళ మహారాజుకు పుల్లరికి గాను తమ మందలో ఆవులకు పుట్టే కోడె దూడలు కొన్ని యిచ్చేటట్టున్నూ వారి దేశమందు వుండే కసవు పచ్చికపట్లు తమ గోగ్రాసముగా ఇచ్చేటట్టుగాను నిర్ణయించుకొని కొంత సైన్యం అందలాలు ఏనుగులతో ప్రసిద్ధముగా వుండేవారు. మరికొన్ని దినములకు క్షామం దశవల్లను గోవులు గ్రామంలో ఎక్కడెక్కడ వుండే సస్యాదులను గోవులు మనుష్యుల అంకిలిలో నిల్వక మేసేవి. కనుక ప్రజలు రాజుతో యీ సంగతి విజ్ఞాపన చేసుకున్న యెడల బీడు పచ్చిక పట్లు యావత్తు కాటమరాజు వారి గోవులు మేపుకునే లాగున మాట యిచ్చినాము. పైర్లు వారు మేపుకోవలసినది కాదు అయినా గాని మీరు పైర్లు జాగ్రత్త చేసుకునేది. అని సెల్వియిచ్చి పైర్లు మేపవద్దు బీడు పచ్చిక మేపుకునేది అని కాటమరాజుగారికిన్ని వ్రాసి పంపించిరి. ఇదిగాక అరణ్యప్రదేశమందుల కాటమరాజుగారి విస్తారమైన గోగణం తిరిగి మేస్తూ వుండేది మొదలుకొని గో సంరక్షణార్థమై కాటమరాజుగారు అగపడ్డచోట క్రూరమృగములను వారే వధ చేస్తూ వచ్చేవారు. గనుకనున్నూ అరణ్యమందు గోగణ గోపాలకుల యొక్క సమ్మర్దము విస్తారమైనందున సాధారణముగా మృగములు అరణ్యమందు నిలవకపోతూ వచ్చినందుననున్నూ, మృగవధ చేసుకుని తత్సామాన్య వృత్తివల్లను జీవనోపాయం కనివుండే కిరాతకులకు జీవన హాని యయినందుననున్నూ ఆ కిరాతకులు కాటరాజు యందు ద్వేషులై వుండిరి. ఇదిగాక నల్లసిద్ధరాజుగారు ఉంచుకున్న భోగముదానివద్ద నొక పెంపుడు చిలుక వొకనాటి కాలమందు మ్యాదలోనుండి తప్పించుకుని వెలుపటికి వచ్చి అరణ్యశుకములను గూడి కాటమరాజు ఆవుల మందలకు సామీప్యములకు సమూహముగా వచ్చి ధ్వనులు చేయగా కొన్ని గోవులు బెదరి ల్యాగలను కలగతొక్కుకుని పారిపోయినవి. అప్పుడు కాటమరాజు పినతండ్రియయిన

పోలమరాజు చూచి బాణము సంధానము చేసి వేసినందున ఆ బాణము సమూహములో వుండే పెంపుడు చిలుకకు తగిలి ప్రాణం విడిచెను. ఆ చిలుక కాళ్లలో గజ్జెలుండెలు వుండేవి పోలమురాజు చూచి ఇది పెంపుడు చిలుక అని నిశ్చయము చేసెను. అంతట ఆ రాజు ఉంచుకొని వున్న బోగముదాని వద్దకు తీసుకుని వెళ్ళి అగపడిచి నీ చిలుక తప్పివచ్చినంతట అన్యాయముగా కాటమరాజు పిన తండ్రియయిన పోలమరాజు బాణ ప్రయోగం చేసి చంపినాడని చెప్పినంతట అది చాలా దుఃఖస్తురాలయి అరణ్యములో వుండే క్రూరమృగాదులను వధచేసేటట్టుగాను వ్యాపారాలాడుతూవుండి కాటమరాజుగారి గోవులను న్నూ వధించవమని వుపదేశించెను. కనుక ఆ కిరాతకులు కాటమరాజు వద్దకి వచ్చి మేము సామాన్య మృగములను వధచేసుక జీవనం చేస్తూవున్నామని మనవి చేసినంతట కాటమరాజు అనుకూలించి సెలవు యిచ్చినందున ఆ కిరాతకులు అరణ్యమధ్యమందు మృగాదులను చంపిట్టుగావుండి కొన్ని గోవులను గుండుతో వధ చేసిరి. ఈ సమాచారములు కాటమరాజు విని చాలా ఆక్రోశముతో ఆ కిరాతకులను చంపించి తదారభ్య నల్ల సిద్దరాజుగారికి యిచ్చే పుల్లరి యివ్వక నిలిపెను. అంతట నల్లసిద్ధరాజుగారు పుల్లరి యివ్వమని అందులకు ఆవుల మందలోవుండే కోడె దూడలు తమకు తోలి అంపించమని వర్తమానం అంపించగా అందుకు కాటమరాజుగారు మీ సీమలో మా ఆవులమందకు నిరోపాధిగా వుండినట్టయితే మీకు పుల్లరి యివ్వవలసిన కర్తవ్యం అటుగాక మీ దేశములో వుండే కిరాతకులు మా ఆవుల మందలకు వుపద్రవం చేసి కొన్ని ఆవులను నిష్కారణంగా వధించినారు గనుక మేము పుల్లరి యివ్వవలసిన నిమిత్యంలేదని ఖండనగా వ్రాసి పంపించినందున అదివరకు మందలలోవున్న కోడెదూడలను తోలుకరమ్మని కొంత సైన్యమును నల్లసిద్ధిరాజు పంపించినందున వారు వచ్చి కోడెలను తోలుకపోవచ్చినంతట కాటమరాజువారు వచ్చిన సైన్యమును లక్ష్యము చేయక తిరుగగొట్టినారు కనుక వారు తిరుగా నల్లసిద్ధిరాజు వద్దకి పోయి యీ వర్తమానములు యెరుకచేసినంతట నల్లసిద్ధ చోడ మహారాజులుంగారికిన్ని కాటమరాజుగారికిన్ని ప్రబలమయిన యుద్ధము జరిగినది.

[కృష్ణాపత్రిక. ఏప్రెల్ 7వ తేదీ 1911 - పుట. 5.]

2)

బ్రౌన్ వాఙ్మయ పరిశోధనకు
ప్రభాకరులు వేసుకొన్న బ్లూప్రింట్ ఇది:

# ఛార్లెస్ ఫిలిఫ్ బ్రౌన్‌దొరగారు

— వేటూరి ప్రభాకరశాస్త్రి

*[ఈ యంశము 1928 సెప్టెంబర్ 1వ తేదీ శనివారం త్రిలిఙ్గ పత్రికలో ప్రకటింపబడినది. అప్పుడే ప్రభాకరులు లండను లోని బ్రిటిషు మ్యూజియం వారితో ఉత్తరప్రత్యుత్తరములు జరిపిరి. ఈ విషయమై అక్కడి క్యూరేటురు 16-10-1928లో వ్రాసిన సమాధానము; 26-9-1936 లో జె ఏ ఏట్సుదొర శ్రీ ప్రభాకరులకు వ్రాసిన జాబు 'మణిమంజరి' తొలి సంచిక (1981 ఫిబ్రవరి)లో ప్రకటింపబడినవి.*

*1928 లో ఆరంభించిన వీరి అన్వేషణ 1936 లో ఫలించినది. లండనునుండి యేట్సుదొర మూలంగా ప్రభాకరులకు "బ్రౌను దొరగారి వాఙ్మయ జీవితగాథ" (టైపు కాపీ ఆంగ్లము) లభించినది ఇంతవరకు ఇతరులకు లభ్యంకాని విశిష్ట ప్రతి యిది. కనుక దానినీ ఈ సంచికలో ప్రకటిస్తున్నాము. ప్రస్తుమిది త్రిలిఙ్గ (1928)లో పడిన వ్యాసము. —సం॥]*

క. నూర్లార్లు లెక్కసేయక
పేర్లందిన విబుధవరులఁ బిలిపించుచు వే
మార్లర్థమిచ్చు పితరణి
చార్లెసుఫీలిప్సు బ్రౌను సాహెబుకరుణన్.

ఆంధ్ర భాషోద్ధారకులలో కలకాలము స్మరింపదగిన మహనీయుడు, మహా విద్వాంసుడునగు సి. పి. బ్రౌనుదొరగారి జీవిత చరిత్రమును, ఆంధ్ర భాషకు వారు చేసిన యసాధారణ మహోపకారమును, వారి యాస్థానపండితుల విషయమును, వారు రచించినట్టియు రచియింపించినట్టియు గ్రంథముల విషయమును, వారి విద్వద్గోష్ఠిలో నడచిన కథలను, వారి కితరులు వ్రాసినట్టియు వా

రితరులకు వ్రాసినట్టియు జాబులను సవిస్తరముగా సంధానించి నేను 'బ్రౌను దొరగారి చరిత్ర'మను పేర గ్రంథరూపముగా వెల్లడించనున్నాను.

బ్రౌనుదొరగారు కడపలో నొక గొప్ప బంగాళా కొని పెంపొందించిరి. ఆ బంగాళాను వారు వార్ధకమున మద్రాసులో పోస్టుమాస్టరు జనరలుగా నుండుటచే విక్రయించివేసిరి. కడప, మచిలీపట్టణము మొదలగుచోట్ల వారు జిల్లా జడ్జీ పనిలో నుండిరి. కడపలోగాని, మచిలీపట్టణమునగాని ఇంక నితరత్రకాని వారి ఫోటో దొరకునేమో అని కుతూహలపడుచున్నాను. ఆ ఫోటో ఎక్కడ నేని కలదేని ఎఱిగిన వారు నాకు తెలుపఁగోరుచున్నాను. మరియు దెలుగుదేశమున నెక్కడగాని, ఎవ్వరియొద్దగాని వారు వ్రాసిన జాబులున్నను, వారికి సంబంధించిన కథలు, పద్యము లున్నను దయతో నాకు బంపగోరుచున్నాను. లేదా పత్రికలలో ప్రకటింప గోరుచున్నాను. వాని నెల్ల నా గ్రంథమున చేర్చుకొందును. అర్థప్రాణముల నాంధ్ర భాషాభ్యుదయమునకై యర్పించి, మన ప్రాచీన వాఙ్మయమును బరిరక్షించి పెట్టిన యా మహామహుని చరిత్రము ఆంధ్రుల కెల్లరకు అవశ్యపఠనీయము వారి ఫోటో దొరకెనేని అది ఆంధ్రభాషాభిమానుల కెల్లరకు ఆనందముతో కన్నుల కద్దుకొన దగినదగును. ఎక్కడ నేని దొరకునో దొరకదో !

*[నేటికిని ఆ ఫొటో దొరకవలసియే ఉన్నది కదా!—సం॥]*

# SOME ACCOUNT

# of the

# LITERARY LIFE

# of

# CHARLES PHILIP BROWN

Formerly in the Civil Service at Madras,
Post Master General, etc., etc.

Not Printed for Publication.

LONDON
1866.

# SOME ACCOUNT

## of the

## LITERARY LIFE

## of

# CHARLES PHILIP BROWN.

Formerly in the Civil Service at Madras.

1. Some who have heard of the origin and progress of my undertakings in promoting the knowledge of the Telugu language have desired me to write down some details which they think worth notice. And I reprint this with a view to the republication of my Dictionaries.

2. My father, the Reverend David Brown was for some time Provost of the College at Calcutta, where he was the friend of Claudius Buchanan, Henry Martyn, Corrie, and Thomason, of Carey, Marshman, and Ward. In the published Memoirs regarding them, as also in Hough's and Kaye's Christianity in India, as well as in the Memorial Sketches published by my Mother, many statements are given in his honour. /P/ On (1) his death in 1812 when I was fourteen, I was taken to England: and my brothers were appointed to the Civil service in Bengal, and I was sent to Madras after passing through Haileybury College, where I obtained a prize in Hindustani. (2) After leaving college I applied closely to Latin reading. /P/ On landing at Madras on the 3rd of August 1817 I was ordered to learn Telugu and Marata. There was no sufficient dictionary of Telugu: Campbell's grammar was the only one: the printed native books were merely the paltry prose Vikramarka and Panchatantra Tales: the tutors were natives who spoke English.

3. At that period there were other Browns in Madras: one William Brown, died in 1837. He had printed in 1818 a Vocabulary and Grammar of the Gentoo (Telugu) language. There were some others who bore the same name: but they were not connected with me

4. While I was in the Madras College, I studied the treatises on Greek and Hindu Mythology written by Bryant, Faber, and Maurice: but the wild theories therein propounded a happy effect: for I was disgusted at these visionary declamations: and was cured of all curiosity about fables and the solutions of such dreams; which like fleeting clouds would take any bright shape that a dazzled fancy might suggest.

5. I met with a French romance which I wished to read but I had forgotten the little I had been taught: I therefore resumed it as a study in 1818: in a couple of years I learnt the language, and the taste has always remained.

6. At that time, and until I was more than forty, I was much addicted to composing poems, in the styles of Pope Byron Moore and Swift. But I believe that nearly every volume I wrote in verse has perished. I also burnt my Lanx Satura, a very large common place book which I had compiled in imitation of Bayle and Gibbon. Biography, History, Travels, Voyages and Natural History have in general been my favourite reading. And I was inoculated with a taste for searching out ancient inscriptions.

7. At that time, some of my coevals obtained high honours: but during thirty years that have since elapsed, no one of that number ever attained more than a moderate skill in the languages which it was our duty to learn. So little did I at that time love Indian learning, that my earnest wish was to fly to England and pass my life at Oxford, in classical pursuits.

8. The Telugu nation occupies a country larger than Spain, to the north and west of Madras town. It lies within circles drawn on the map around Kadapa, Rajamahendravaram, and Kondapalli, the radius of each extending to Madras: also drawn round Visakhapatnam, (Vizag) and reaching to

(3) Ganjam, towards Jaggernaut. The population is rated at some fourteen million souls.

9. All diligent students easily acquired so much of the Telugu language, as was then taught in the college: but those Englishmen who have mastered Telugu consider it harder than Sanscrit or Hindustani. Indeed, as is the case in regard to Persian and English, a foreigner finds Telugu becoming more arduous the higher he ascends. The first paths are tolerably level; but the further he climbs the steeper he finds the hill.

10. One occurrence produced a lasting effect on me. In 1820 Sir Thomas Munro arrived in Madras as governor, and was present at the College when my final examinations (4) took place. He addressed the Students in a brief speech, pointing out the necessity of studying the languages if we wished to do our duty honestly. That (5) speech has been printed in the Asiatic Journal. It gave offence to some seniors in the service. One of the Juvenile hearers, a fellow student of mine, on coming out of the hall derided the governor's statements. This led me to reflect that the speech was by an eminent and venerable personage. This consideration perhaps gave me the first inclination to study the languages.

11. I was then sent to the Cuddapa (Kadapa) district; where I presided in a Police office for two years: all the work being carried on in Telugu, Kannadi, Marata or Hindustani. I soon acquired the colloquial Telugu; not to speak it well, but better than my neighbours; for at that day no Englishman had ever studied Telugu throughly Some few had a name as good scholars, but their skill was far from great.

12. In my leisure hours, while at Cadapa, I read Greek; Hebrew, and Persian. I carefully studied the Holy Scriptures, using the commentaries of Scott (him of Aston Sandford) (6), thus gaining a good acquaintance with the sacred text. I did not study Telugu: though I daily corresponded in it (by means of an amanuensis) on business.

13. In James Ferguson's biography of himself he says of Cautley "He was what is generally called self taught: but I think he might with much more propriety have been termed God Almighty's scholar."

14. As Shakespeare says (All's Well, ii.1.)
" He that of greatest works is finisher
Oft works them by the weakest minister."

15. In the end of 1822 (being 24 years of age, on 10th of November) I was appointed to be Assistant Judge at Masulipatam; where Telugu is the language of the people. But still I would not study Telugu: I gave my leisure hours to Latin reading: and along with KEIGHLY (subsequently Judge Advocate General) perused Juvenal and Lucan, Ovid, Lucretius and other Latin poets with great zest: each of us reading fifty lines in turn. (7).

16. I began writing notes in Parkhurst's Greek Lexicon; with a view to preparing a new Telugu translation of the New Testament. Pritchett's Telugu version had been printed in 1819 and I knew it was not accurate. Other versions have since appeared but they are mainly founded on that work.

17. I obtained a grammar of the Bengali language: and taught myself that character: this was afterwards very useful to me.

18. At last in the year 1824 I was induced to commence a regular study of the Telugu poets: and I read for seven years steadily. Yet at first I was nearly shipwrecked more than once, because of the pedantrv of my learned instructors. The bramhans consider the most abstruse branches of learning primarily desirable: and on three occasions I desisted from study, being daunted by the phantoms these wiseacres conjured up. All that is ordinary, natural and useful they despise. Were we to submit entirely to their guidance we should learn nothing that is intelligible. Like the Persian poet Jamy, or the Spanish poet Luis de Gongora (see notes on Smart's Gil Blas III. 148. Book VII C. 13.) the modern poets " admire a vicious affectation, with pedantic obscurity, so that every word is a metaphor and every sentence is a riddle." /P/ One, who gloried in being a poet, undertook to teach me Telugu Prosody. Having taught myself Greek and Persian prosody, I managed to understand his statements. My next tutor gave me, an equally potent dose of learning, by leading me (in 1825) to

read and translate the Bhattiyam, a most intricate Sanscrit treatise on Telugu grammar. It seems that Hindus however learned are not very rational. They delight to aid us in understanding their poets: but seldom can give a reason for any peculiarity in grammar.

19. Happily I was a docile student, and was determined to succeed: but looking back on these occurences after the lapse of forty years, I see reason to wonder at my perseverance.

20 The Hindus fancy that reading a sacred book (as the Ramayan or Bhagavat) confers merit, both on the pupil and on his teachers: while it is needless to have any exact acquaintance with the meaning. My preparatory readings in Mythology had taught me the truth regarding Hinduism: and the books which I have printed show my opinions regarding that system of idolatry, Priest-craft and superstition.

21. My learned assistants were entirely ignorant of English: and their explanations were given either through Telugu, Sanscrit, or Hindustani. The lexicons I used were Campbell's Dictionary, printed in 1821, which omitted nearly all the words I wanted: and Wilson's excellent Sanscrit Dictionary. One of my ablest instructors was an aged poet who had passed his youth in Benares, and therefore could speak Hindee: and in that dialect (as well as in colloquial Telugu) he explained Telugu poetry to me.

22. To commence a language without a dictionary and without a grammar requires some determination. However; he is but a poor workman that cannot work without tools.

23. When a lady asked Lord Bacon how he strengthened his memory, he replied, Madam, by never trusting it. I had read this story and acted upon it. I could at one time repeat many of Horace's odes, and much of Milton and other poets: but I rarely committed anything to memory.

24. He who writes a dictionary of an unexplored language is often misled. When I was first reading the Telugu Mahabharat in 1825 (having first numbered each stanza) when I came to a new word, my learned assistant gave me the meaning in colloquial Telugu: and this I recorded in my dictionary.

But it occurred again twice or thrice and each time I had to record a new meaning. At last I remonstrated on this, pointing out the different passages I had collected; with the contradictory interpretations given by him. He replied, Sir, if you write down all we say, who can endure it ? Perhaps the word in question is unknown to me.; I therefore suggest some interpretation (8). But you at once record it ; and then you require me to reconcile such interpretations (9).

25. I did not possess a single Telugu Volume: and ignorant as I was of all the poets in the language, the Abbe Dubois, in his Account of the Hindus, had acquainted me with the name of Vemana, a rustic epigrammatist. I was led to peruse and translate his writings. They extended to about nine thousand lines. I than proceeded to other authors, more respectable but not more profitable to a beginner. In 1826, at the request of Mr. Richard Clarke a member of the College Board, I wrote an Analysis of Telugu Prosody ; adding explanations of the Sanscrit system. This I printed in 1827 ; and Vemana with an English version in 1828. * /P/ I had formerly been acquainted with Mr. Jarrett, who had printed the Hebrew version of St. Matthew's Gospel. He counselled me in 1826 to desist from my Telugu pursuits, predicting that my ardour and enthusiasm would soon cease.

26. The Government once sent me, for nearly a year (1829) to serve in the Provincial Court at Trichinopoly: which is a Tamil country ; but excepting this period, I was always kept in various Telugu countries. Meanwhile I carefully studied Adam Clarke's Commentaries on the Holy Bible. An old poet says

As more and more our understanding clears,
So more and more our ignorance appears.

27. I then resided three years as Judge in the court at Masulipatam the capital of the Telugu country: and there I began to amass a library of Telugu and Sanscrit manuscripts. Some affirm that the bramhans are unwilling to let us have their books : but by courtesy and gentleness I easily obtained every volume, however sacred or secret. Herein money has no power.

28. When we study Greek or Latin we use books free from errors. But when I began to read the Telugu poems, none were printed, or correct. I therefore collected several written copies, and caused a new correct book to be prepared. I discovered some excellent scholars living in poverty, (10) mendicants and they were glad to be thus employed on wages as moderate as those we give to menial servants.

29. Sanscrit and Telugu poems are preserved in manuscripts, on palm leaves: on which the natives (11) write rapidly with an iron style: engraving the letters and using no ink. Such writing is not more legible than the inscription on a penny: being all of one dark colour. This tries the eyesight much; and therefore before studying a poem I had it copied in a clear hand on English paper: numbering each verse to facilitate reference.

30. There are one or two anecdotes which some think worth pre-serving. At Kadapa I had been assistant to Mr. Hanbury, who spoke Telugu easily; indeed his example filled me with emulation. He had then been twenty years in India. Four years after, he again was with me at Rajahmundry, and was surprized at the ease with which I spoke Telugu; he remarked, "I think in English and then put it into Telugu: but you seem to talk Telugu; but you seem to talk Telugu without care or forethought." (12)

31. Some of the favourite poems have passages which are intricate. To illustrate these I caused Telugu commentaries to be framed: and desired that no difficult passages should be settled without referring to the statements and quotations placed in my dictionary. /P/ In one mystical poem, entitled the Rama Stava Rajam, the body is described as a city, in which the soul is a resident; an allegory similar to one by Bunyan. The learned bramhan who was the editor (this was in the year 1833) brought me one passage so mysterious that he was unable to explain it. After some consultation I advised him to give it up. This he would not do. A week after he brought me the Telugu comment he had framed. I read it and observed that it was ingenious but the readers would complain that it had nothing to do with the text: he laughed and said, I shall leave them to find that out.

32. In reading Sanscrit poems we are aided by commentaries; but I found only two Telugu poems furnished with such notes: and these notes were written less to aid the learner than to glorify the acumen of the critick. A similar remark is made in the preface to the Delphin edition of Virgil. Fuit iis hominibus" etc. Beginning from the year 1827 until 1854 I employed learned bramhans (whom I paid for the purpose) to prepare Telugu commentaries, in the easiest style, to explain those poems which I wished to study. In course of time, notes were appended to all the leading Telugu poems: a list of these is given in the Introduction to my Telugu Dictionary. The commentaries framed at my expense have been greeted with much applause as illustrating and perpetuating Telugu literature.

33. I did not give all my attention to Hindu studies: I accumulated an extensive library of English, Greek, Latin, French, and Persian books: but such reading leads the heart towards Deism. In fact, all learned Hindus and Musulmans are deists. (13)

34. Books alone will not teach Telugu as spoken at the present day. I therefore studied the every-day dialect in the police office or in the court wherein I presided. There cannot be a better school. And whenever I had a conversation with a plaintiff, witness or prisoner; with a learned native judge or an ignorant menial, every one became my teacher for the time.

35. In discharging my duty as a judge I was zealous and too often rash. An aged judge who shewed me great friendship, predicted (in 1825) that I should do great good but injure myself. He on one occasion said Go on, my friend; you will certainly ruin yourself: but do not fear: I know that God will recompense you.

36. My passion for accumulating a library was strong, and I saved no money; indeed there were always from ten to twenty bramhans and Sudras in my pay; employed transcribing native authors, in preparing correct editions, in framing indexes or commentaries in Telugu. I also attempted in 1832 to establish a Telugu printing press at Masulipatam but was baffled by the dishonesty of the Englishman I employed.

37. In February 1830 I printed in a Madras newspaper an anonymous statement regarding trade: shewing which goods, from England, are most in request among the Hindus. This was copied into the Bengal newspapers, and twenty years after I again met with it in an American edition (note on chap. XXIX) of Miss Roberts's Charackteristicks of Hindustan. Thus the advice (which was at first derided) travelled round the world and produced effects which are still perceptible.

38. I made several attempts to translate Johnson's English dictionary into Telugu and completed the rough sketch of the English Telugu Dictionary in 1832. /P/ In that year I wrote my first Telugu transalation of the Gospel according to St. Luke and the Acts of the Apostles. This is noticed in the 36th Report of the British and Foreign Bible Society page 51. Also in the volume called "The Bible of Every Land" 40, 1848, page 120 (14). Little did I imagine that it would cost me so many more years of labour.

39. In my leisure hours I generally read Sanscrit : and I wrote a Latin translation of twenty-two cantos of the Lalito Pakhyanam.

40. In the end of 1834 I took the Government furlough for three years : and sailed for England : having been seventeen years in India.

41. I enjoyed England vastly, having good health and spirits. But visiting my relations and friends, jaunts, sight-seeing and tours, still left me daily some hours of leisure : which I occupied in completing a transcript of the Dictionary : and in writing a Telugu Grammar. /P/ I also was requested by Professor Rosen to write a short treatise explaining Sanscrit Prosody : which he immediately printed in the Asiatic Journal. This I re-wrote in 1865. /P/ I was also invited to assist in collating antiquo (15) manuscripts of some Latin poets in the British Museum and Bodleian libraries. And I examined the Telugu and Kannadi manuscripts stored up in the India House Library; of these I framed a Catalogue at the request of Professor Wilson : for which the Honorable Court in March 1837 bestowed upon me their thanks. (16)

42. In consequence of my suggestions those manuscripts were sent to Madras: where I received them in September 1844.

43. On returning to India for a second seventeen years in January 1838, I printed an Essay on Telugu Literature, a long paper on the creed and literature of the Jangams, and some other papers. These were chiefly published in the Journal of the Madras Literary Society; also a number of essays which where printed in the newspapers. Some were on education, others on Hindu customs and prejudices, or on various themes which possessed a temporary interest: and a series of remarks on the Roman Catholic idolatry; which made some noise.

44. I also resumed the work of writing a Telugu translation of part of the Scriptures. I printed St. Luke's Gospel and a Telugu Version of the Book of Common Prayer at the desire of Bishop Spencer. But in late years I did all these works anew.

45. A Jangam poet in my employ having read my version of St. Luke, I requested him to write it in Telugu metre. This he accomplished and it was printed in 1854.

46. My Telugu Grammar appeared in the end of 1840. It became popular at once.

47. At different times I opened free schools, with native tutors, to instruct natives in Telugu and Hindustani. In 1821 two such began at Cudupah, and two at Masulipatam in 1823. In 1844 I established a free school at Madras teaching English Telugu and Tamil to about one hundred pupils. These lasted seven years, when they ceased because they required closer superintendence than I could give, and some frauds detected. I then made over these schools to the Rev. Christian Arulapen.

48. I was appointed Persian Translator to Government in January 1838: and in September I was nominated to a seat (without pay) at the College Board. At that period the College was in a state of idleness: and Mr. Campbell our aged president had fallen into the indolent habit of showering applause upon every one whom he examined. I learnt that this had brought ridicule upon the reports printed by the College: and I urged the prudence of stating the exact truth. This displeased my

# బ్రౌను జాబు

వాల్యూం నెం. 15-6-11
లెటరు నెం. ౬౫

మహారాజశ్రీ సీ పీ. బ్రౌన్ యిస్క్వయరు దొరగారి సముఖానకు

వద్దూరి నృసింహావధానులు వ్రాసుకున్న అర్జీవిన్నపము. తమరు సమస్త గ్రంథములు వ్రాయించి యింకా కొన్ని రహస్య గ్రంథములు నాచాత తమరు తెప్పించి వ్రాయించి మాతృకలకు వక మామూలుచేశి రూకలు యిప్పిస్తూవచ్చి నారు. తమరు కొంతమట్టుకు వ్రాయించినంతల్లో వ్రాయించినమట్టుకు అబద్ధములు లోపములు వుంటే అవి సంప్రతించి సమగ్రంగా భాగుచేశినాను. యీ చొప్పున నేనున్ను నా గుమాస్తానున్ను తమరు వ్రాయించినమట్టుకు గ్రంథములు మొకాబిలా చేస్తూ వుండగానె యింకా కొన్ని గ్రంథములకు వ్రాతకూలిన్ని మాతృకలకు రూకలు దయచేయించితే నావద్ద వ్రాస్తూవుండే గుమాస్తాలచాత వ్రాయించి మొకాబిలాచేసి సముఖమందు దాఖలుచేస్తూవచ్చినాను. అంతట తమరు గుంటూరు విజయంచేశి తిరిగి బందరు వచ్చిన తర్వాత యింకా కొన్ని గ్రంథములు వ్రాయనవి వుండగా అవి వ్రాయించమని ది ౨౦ సెపిటెంబరు ఆన ౧౮౩౭ సంవత్సరం తారీఖున ౧౦ శిక్సనులున్ను, అక్టోబరు నెలలో ౪౫ శిక్సన్‌లున్ను వెరశి ౫౫ శిక్సన్‌లున్ను యిప్పించినారు అవి అక్టోబరు నెలలో ౨౮ శెక్సన్‌లున్ను నవంబరు నెలలో ౨౭ శిక్సన్‌లున్నూ వ్రాయించి మొకాబిలాచేశి వుంచినాను అందుకు రెండు నెలలనుంచి నాకున్ను నా గుమస్తాకున్ను తమరు పూర్వం యిప్పిస్తూ వుండే మామూలు ప్రకారం జీతమున్ను వ్రాతకూలిన్ని మాతృకలకున్ను యిప్పిస్తూవుండే రూకలు దయచేయించలేదు. వక పర్యాయం నా తమ్ముణిన్ని, నా గుమాస్తానున్ను రాజమహేంద్రవరం పంపిస్తే తమరు శలవుయిచ్చేలాగు బందరు పంపిస్తామని చెప్పినారు. యిదివరకున్ను దయచేశి పంపించలేదు నాకు నెల రోజులనుంచి దేహంలో జాడ్యంచాత అతిసారగుణం పుట్టి బహు నీరసంగా

వున్నది నావద్దను తమ గ్రంథములు వ్రాయించినవి ౫౫ శిక్సనులు వున్నవి. జీతము వ్రాతకూలి వగయిరా రు ౮-౦॥ యిప్పించవలెను. యిప్పుడు మా తమ్ముడు సుబ్బన్నను తమ దగ్గరనాన్కు పంపించివున్నాను. నేను వ్రాసుకున్న మనవి తమరు చిత్తగించి నావద్ద వున్న గ్రంథములు వ్రాయించిన శిక్సనులు ౫౫ న్ను యిక్కడ వున్న సముద్రాల నృశింహాచార్యులు పరంగానైన, బ్రౌన్దొరు పరంగానైనా, నాజరు వీరాస్వామి పరంగానైనా సదరహి గ్రంథములు అప్పగించే లాగు చెయ్యమని వ్రాయిస్తే తమ శలవు ప్రకారం యెవరి మారీఫతు వప్పగించ మని వ్రాయిస్తే వారి పరంగా అప్పగిస్తూవున్నాను. యీ కింద వ్రాశిన తపిశీలు ప్రకారం రూకలు రు ౮-౦॥ నాను యిప్పించేలాగున బ్రౌన్దొరుపేర శల్వు వ్రాయించ వలెను. వీరాస్వామి పేర యీ మధ్యను ఉత్తరం వ్రాయించినారు. రుగ్వేదం భాష్యం వ్రాయించినారేమో పంపించమని వ్రాయించినారు. ౭ పంచకం, ౮ పంచకంభాష్యం వ్రాశివున్నది. తతిమ్మా పంచకాలు భాష్యం వ్రాయించమని శల్వువ్రాయిస్తే మాతృకలు తెప్పించి వ్రాయిస్తూవున్నాను నేను ఇదివరకు వ్రాయించి తమకు ఇచ్చిన గ్రంథములలో వ్రాశ్నిది తిరిగివ్రాయించినా అబద్ధము వ్రాశినా తమకు రెట్టికి నాల్గురెట్లు ముదరా యిచ్చి తమరు చేయించిన శిక్షకు హాజరువున్నాను. వ్రాతకూలిన్ని మాతృకలకు ఇవ్వవలశ్ని రూకలకున్ను బహుబాధ పెట్టుతూవున్నారు తమరు యీ పర్యాయమయినా అనుగ్రహించి రు ౮-౦॥ దయచేయించవలెనని వేడుకుంటూవున్నాను.

దివ్యచిత్తానకు తేవలెను.

ది ౧౪ మార్చి ఆన ౧౮౩౪.

నరసింహావ్వధానులు వ్రాలు.

[సరస్వతి (ముక్త్యాల) 1924]

# బ్రౌను జాబు

వాల్యూం నెం. 15-6-11
లెటరు నెం. 125

మహారాజశ్రీ మేస్తరు చా॥ పీ॥ బ్రౌన్
యిసొ్కాయరు ధొరగారి సముఖానకు.

శ్రీమంతు శ్రీదుర్గాప్రసాదనాయ్డు బహాదరుగారు అనేక సలాములు చేసి చాయంగలవిన్నపములు. తమ తాలూకు పుస్తకములు ప్రతి వ్రాయించడం నిమిత్తము ౧౭ జులై ఆషాఢ శు ౧౨ యిందువాసరం తారీఖున నేను వ్రాసుకున్న ఉత్తరం ప్రకారం తమరు దయచేయించినారు. గనుక్కా సదరహి పుస్తకములకు పుత్రికలు వ్రాయించి మాతృకలు తిర్గి పంపిస్తిని. దాఖలు చిత్తగింపకర్తలు. నేను యిదివరకున్ను తమదర్శనం శాయకపోవడంకు వుండేగింజిచాత పితృసమానమయ్ని తమయొక్క మహాదనుగ్రహమును కోరి చంద్రచకోరన్యాయంగా నిరీక్షిస్తూవున్నాను నేనున్ను అమావాస్య వెళ్ళించి దరిశనానికి వస్తూవున్నాను. సన్నిధానమందు వుండే సమయమందు వుంచిన వాత్సల్యతె సర్వదా వుంచుతారని నమ్మివున్నాను.

దివ్యచిత్తానకు తేవలెను.
ద॥ శ్రీ॥ దుర్గాప్రసాదనాయ్డు

ది ౧౩ అక్టోబరు. ఆన ౧౮౩౨ సంవత్సరం, శెనివారం,

[సరస్వతి (ముక్త్యాల) 1924]

# బ్రౌన్ దొర జాబులు

వాల్యూం నెం 15-6-11
లెటరు నెం 58

శ్రీ మన్మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యులు మాతమ్ములయిన వీరేశలింగంశాస్త్రులను ఆయురారోగ్యైశ్వరాభివృద్ధిగానున్ను పుత్రపౌత్రాభివృద్ధిగానున్ను ఆశీర్వదించి తెలియసేయంగలసంగతులు. ఇక్కడ కుశలం. అక్కడి శుభస్థితులు వ్రాయించి పంపిస్తూ రావలెను. తరువాత మహారాజశ్రీ మేస్తరు సీ. పీ. బ్రౌన్ యిస్కోయరు దొరవారు నీపేర వుత్తరము వ్రాయించి దయచేయించినారనిన్ని ద్విపద పండితారాధ్య చరిత్ర, పరమయోగివిలాసము యీ రెండుగ్రంథములు సంగ్రహించి పంపించవలసినదనిన్ని నీవు నాపేర వ్రాశిన వుత్తరము అందినది మొదలుకునిన్ని యిక్కడ పెదనలోనేమి యీ సమీపగ్రామములలోనేమి విచారించి చూచినంతల్లో పైనివ్రాయఁబడియున్న రెండుగ్రంథములలో పరమయోగి విలాసము యేతావున యెవరివద్ద వున్నట్టు యెంతమాత్రం తెలియలేదు. కాని పాల్కురికి సోమనారాధ్యవిరచితమున్ను ప్రకరణపంచకమున్ను ఆయిన ద్విపద పండితారాధ్యచరిత్ర యిక్కడికి అత్యంత సమీపంగావున్న గంద్రమనేగ్రామములో గంద్రపు కొండయ్యగారియింటివద్ద వుండివున్నది. అయితే ఆ గ్రంథము నాల్గువందలతాటియాకులమీఁద వ్రాసివున్నది. గ్రంథసంఖ్యా పదివేలపర్యంతం వుండవచ్చును. అదిన్ని అక్కడ వ్రాసుకునేటట్టుఅయితే యిచ్చేటట్టు కనపడుతూ వున్నది. గాని గ్రామాంతరములకు పంపించేటందుకు యిత్తురని యెంతమాత్రం తోఁచలేదు గనక లేఖరిని చూచి తెలుసుకుంటే ఆ చారిత్ర రెండునెలలు వ్రాయవలసిన గ్రంథమనిన్ని నెల ౧కి యెనిమిదిరూపాయీల చొప్పున జీతమున్ను కాగిదములు వగయిరా ఖర్చులకై అయిదురూపాయీలున్న యిప్పిస్తే తాను అక్కడేనేవుండి అయినా లేక యిక్కడికితెచ్చుకునిఅయినా వ్రాసియిస్తానని చెప్పినారు. తాటియాకులమీఁద వ్రాయించేటట్టుఅయితే అలిఖితపుఖరీదుమాత్రం పుచ్చుకుని పయినవ్రాసినప్రకారం జీతమునకే వ్రాసియిస్తానని అన్నాడు.

ఎటువంటిలేఖరిౘ్రాసినా రోజుంకి అయిదుపత్రములకంటె యెక్కువౘ్రాయలేడు. యీ గ్రంథము తాటిఆకులమీఁదౘ్రాయించడమే యుక్తమో లేక కాగిదములమీఁద వ్రాయించడమే యుక్తమో విచారించవలసినది. కాగిదములుఅనగా చటకం కాగిదములమీఁద వ్రాసియివ్వడమునకే కాగిదములఖరీదు అయిదురూపాయీలు అడిగినాడు. గనుక యీసమాచారము తెలియగలందులకు వ్రాయడమయినది.

ది ౨౧ అక్కొటోబరు ౧౮౩౯ సంవత్సరం.

వాల్యూం నెం 15-6-11
లెటరు నెం 88

రాజశ్రీ వరెం అద్వైతబ్రహ్మయ్యశాస్తులుగారికి.

సల్లాం. త॥ఆ దేశముకు మీరు చేరినతరువాత మీకు ఆరోగ్యమైనసంగతిన్ని కానిసంగతిన్ని వినకపోవడమువల్ల నిండా విచారముగా వున్నాము. దైవసహాయమువల్ల త్వరగా ఆరోగ్యముకావలెనని కోరియున్నాము. మెట్టుకు యిందును గురించి త్వరగా మాకు యెరుకచేస్తే బహుసంతోషిస్తువున్నాము. ప్రస్తుతం వ్రాయించేసంగతియేమంటే పోయిననెల ఆరంభమునుంచి వసుచరిత్ర ఛాపా చేశేపని బొత్తిగానిల్చిపోయినది యిందువల్ల మనకు చాలాఫలం రావలసినందుకు ఫలం రాకుండా నష్టం సంభవించబోతున్నదని చింతపడియున్నాము యీ పని యెందుకునిల్చిపోయినదో అని విచారించినంతల్లో ఛాపాచేశేవాండ్లకు మనము ఆయిదువందలరూపాయీలమట్టుకు బాకీ పడినట్టుగా తెల్సినది. యీ పని యింత దూరం జర్గించివుండి మధ్య చాలించుకోవడం మహాహానికరం మంచికటికాదు. యింటికి గోడలుకట్టినతర్వాత పైకప్పుమాత్రం బాకీవుంచి ఆరవ్వంత కుదర కుండా యిల్లుయావత్తు పాడుచెయ్యడం యంతపని అవునో యిదిన్ని అలాగ్నునే వున్నది. యీ పని చాలించేబుద్ధి మీకు ఒకవేళ ఉదయించినదేమో అని సందేహించి మనకు ప్రత్యామ్నాయం యితరులు యీ పని మీదపడేటట్టు యోచించి యున్నారు. గాని ఆచొప్పున కుదరకపోయినది. యెందునుంచి అంటే పని సగం మట్టుకు జర్గివుండగా పరులు యిందులో చెయిచేశేటందుకు సంకోచిస్తూవున్నారు.

మరిన్ని వాండ్లు అట్లాసంకోచించడం న్యాయమే. యెందుకంటే వకరు ఆరంభించిన పనిని మరివకరు వుద్యోగించి తీర్చడం అపరూపమై బుద్ధిదూరమై వుండును. యీ పనిని యీ తీరుగా నడిపించుటే మనకు యాపత్తు నష్టిసంభవించకుండా మీకు యెరుకచేయడం మాకు ధర్మమే. మీరై యీపని కడాకు జర్గించడానకు బుద్ధిలేక పోయినపక్షముకు ఉత్తరోత్తరా పరులు యిందులో ప్రవేశించి కడాకు సాగించిన పక్షమందు దీనియొక్క ఫలమేమి? పెట్టుబడిరూకలుయేమి తిర్గి మనకురావడానకు ఆకరం కనుపించలేదు. ద్రవ్యఫలమున్ను శాశ్వతమైనపేరున్ను రావలసినపని యెడల సుఖం యెంతమాత్రం సంభవించకుండా నష్టంతెచ్చుకోపడం లేతపని ఆవును గనుక్కు మీరు ఆవశ్యకరముంగా నేను యీసారిచెప్పుతున్నబుద్ధిని ఆలోచనకుతెచ్చి ఆపన్నంగా మ॥ సుబ్బారావు యీపని ఆఖరుపర్యంతం కాజేశేలాగు మీరు ఆవశ్యకముగా యేర్పరచవలెనని యీ జాబు మీపేరిట వ్రాయించడమయినది. యిదిగాక మేము చెప్పుతున్న ఆంధ్రవ్యాకరణమున్ను ఆంధ్రనిఘంటువున్ను ఇంగ్లీషు నిఘంటువున్ను యీ మూడు గ్రంథములున్ను తామేఆయి చాపాచెయ్యడముకు యిక్కడవుండేవక పుస్తకాలవర్తకుడు యత్నపడి మాదగ్గెర దగఖాస్తుచేసినాడు. గనుక యీ మూడు పొస్తకాలున్ను నేను యేర్పరించినప్రకారమే స్వచ్ఛంగా పుట్టేసమయం వచ్చినది కాబట్టి యీ సమాచారం మీకున్ను సంతోషకరమేగనుక్కు వ్రాయించడమయినది. యింతే సల్లాం.

ది ౩౧ జనవరి. ౧౮౪౦ సం॥

C. P. Brown.

[సరస్వతి (ముక్త్యాల) 1924]

# బ్రౌను దొరగారు

బ్రౌను దొరగా రాంధ్రకవితాప్రియులుగదా! ఆంధ్ర కవితాగంధ మెఱుఁగనిచతురుఁ డొకఁ డీక్రిందిపద్యములు యతి ప్రాసచ్ఛందస్సంధి వ్యాకరణముల బాధ లేకుండ రచించి యాయన కిచ్చి యాదరింపఁబడినాఁడట :-

క. శ్రీయను పురుషుఁడు గాకను
బాయక సర్వప్రపంచబావన తానై
ధ్యేయ మగువెలుగు బ్రౌన్‌దొర
కాయతముగ నొసగు నాయురారోగ్యములన్. 1

చ. తలపగ బ్రౌనుభూపతి తలంపను నాకసమంది చుంబనం
బలవడజేయ సాధుజనసాగర మేగిర ముచ్చిపొంగ దు
ర్బలపరిపంథిరాజ పరిహాస్యతమఃపటలం బడంగగా
లలితమనస్కుఁడౌ విజయశాలిముఖం బనుచంద్రుదు గంటిరే. 2

ఉ. ఆశ్రితభూజనాళివిజయాశ్రితులై తను చుట్టుముట్ట స
శ్రాంతము గొల్వ నాబ్రవునుభూపతి యారయ తేజరిల్లె కా
శీశుజటాటవిన్ విడచి కాంచన శైలము నెక్కఁబూని యు
త్సాహకుడైన చంద్రు దలతారలతో విలసిల్లుకై వడిన్. 3

ఉ. గాయకకోవెలల్ చెలగి కూయగజొచ్చె కవీంద్రమారుడా
డాయతమయ్యె దాసి కుకవీజన పాంథుల వాక్కుఁదూపులన్
వేయగజొచ్చె రాజపరిహాస్యతమం బనుచీకటింతటం
బాయగజొచ్చె బ్రౌను ముఖచంద్రుడు వెన్నెలగాయజొచ్చినన్. 4

ఉ. ఏమహనీయమూర్తి కృప నారయ కల్పతరూపమానమౌ
యే మహనీయు కీర్తి త్రిజగన్నుతస్ఫూర్తికి నాస్పదంబునౌ
యే మహనీయు దీక్ష జయలక్ష్మి కటాక్షణలక్షితంబునౌ
నామహనీయు బ్రౌనునరనాయకు నెప్పుడు నాశ్రయించెదన్. 5

ఉ. ఎవ్వని భాగ్యలక్ష్మి యెడబాయక యుండును నాశ్రితావళిన్
ఎవ్వని కీర్తిలక్ష్మి ననిశంబు పురందరు పూజనీయమౌ
నెవ్వని ధర్మలక్ష్మి సతిదీనులపాలిటి కల్పవల్లి యీ
ముష్వురులక్ష్ములం తనివి దీర్చెడి బ్రౌనుమహీశు గొల్చెదన్. 6

[-సరస్వతి (ముక్త్యాల) 1924]

# బ్రౌను జాబు

*[నిత్య నవీనములూ, గమనార్హములూ అయిన విషయాలను రికార్డులలో నుంచీ, జాబులు, కైఫీయితులు మొదలయిన వాటిలో నుంచీ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలవారి పర్యవేక్షణ క్రింద సేకరించినవి, క్రమశః ప్రచురిస్తాము - ఇది 12-3-1944 నాటి ఆంధ్ర పత్రిక సంపాదకుల మున్నుడి - సం॥]*

బ్రౌను కంపెనీ సర్కారులో 1818 నుండి 1835 దాక సబ్ కలెక్టరుగను జడ్జీగను పోస్టుమాస్టరు జనరల్‌గను గవర్నమెంటు ట్రాన్స్లేటరుగను ఆంధ్రదేశమున నుండి ఆంధ్రభాషకు చాల సభ్యుదయము గూర్చినాడు. అతడాంధ్రభాషకు చేసిన దమూల్యసేవ. అతడు పండిత పోషకుడుగను ఆర్తజనరక్షకుడుగను నుండెను. తన జాబులను నింకను నితరులజాబులను సేకరించి భాషాకీర్తిని శయ్యను ననుసరించి విభాగములు చేయించినాడు. అవి కొన్ని ప్రకటింతుము.

బ్రౌనుదొరగారు కడపలో సబ్ కలెక్టరుగానో సబ్ జడ్జిగానో కొన్నాళ్లుండి అక్కడ నొక బంగాళా కొని తోట వేయించి నూయి త్రవ్వించి, అందు కొందఱు పండితులచే గ్రంథవ్యాఖ్యానాదులు చేయిస్తూ వుండేవారు. బందరు గుంటూరు మొదలగు స్థలములలో నుండినను ఈ కార్యమిక్కడ కొంత సాగుతూనేవుంది. కడపలోని బంగాళా వగైరాలను చక్కజూస్తూ ఉండే కృష్ణారెడ్డి యను నాజరు వ్రాసిన జాబిది.

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యస్క్వయర్ దొరగారి సముఖానకు నిజపోష్యవర్గుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి పదివేలు సల్లాములు చేసి అత్యంత వినయపూర్వకంగా వ్రాసుకొన్న మనవి యేమంటే—

1. తమకు చిత్తూరుజిల్లా ఆక్టింగుజడ్జి పనికి పైంటు అయినట్టుగా గవర్నమెంటు వారు ఈ జిల్లా కోర్టుకు పంపించిన పబ్లిక్ న్యూస్ పేపరువల్ల ఈ రోజు తెలిసి చాల సంతోషాన్ని పొందియున్నాను. తమకు అతిశయమైన ప్రభుత్వం సంగతి వినడమే కాకుండా తమరు చిత్తూరుకు పోయేటందుకు ఈ మార్గాన రావడం వల్ల తమ దర్శనం కలుగుననిన్ని యిక్కడ సమీపంలో తమకు గొప్ప

ప్రభుత్వం కాపడమువల్లనున్ను మిక్కిలి నా అదృష్టం అని యెంచి నాకు కలిగిన సంతోషమింతా అని వ్రాయడానకలవి కాకుండా వున్నది తమ రే తారీఖు గుంటూరు విడిచి బయలుదేరేది వ్రాయించి పంపించే లాగున ఆజ్ఞ దయచేయ వలెనని కోరుతూ వున్నాను

2. మరిన్ని కడప షహరుబజారు దోపిడి అయిన సంగతి యాపత్తు వ్రాసి పంపించే లాగున ఆజ్ఞాపించినారు. ఆ సంగతి యొక్క పూర్వోత్తర మేమంటే, యిప్పటికి సుమారు ఇరువై దినముల క్రిందట ఒక సాహుకారి యింటికి అర్థరాత్రివేళ సుమారు 100 మంది దొంగలస్తోమువచ్చి యింటివాకిండ్లభీగాలు పగలగొట్టి సుమారు 3000 రూ॥ల నగలు దోచుకొనిరి. అంతలో షహరులో వున్న పోలీసులు బాకశివాయిలు స్తోమమయి పోయినందున వారు పారిపోయిరి. ఇంటి వాండ్లకు శరీరాయాస మేమీ కలుగలేదు ఆ సంగతిలో కలసివున్నట్టుగా ఆరుమందిని క్రిమినల్ కోర్టుకు పంపినారు. ఎవరివల్ల జరిగినది యింకా పరిష్కారంగా తెలియలేదు. చిత్తానకు రావలెను.

3. లేటు శిరస్తాదారు కేసును సరికోర్టు దొరవారు తిరిగి క్రిమినల్ కోర్టుకు కైదిపరం సాక్షులను విచారించేటట్టుల ఉత్తరువు వ్రాయించినారు. ఇంకా పరిష్కారం చేయలేదు, కొద్ది రోజులలో మేస్తరు పి హె. స్మిధుందొరవారు వస్తారని వదంతి వున్నది.

4. ఈ కడపలో బీదవాండ్లను గురించి, ఇక్కడవుండే జనం యేరీతిగా ఏర్పరచినదిన్ని వాండ్లకు నిత్యము ఏమి ఖర్చు తగిలేవన్ని యిందుల విపరం వ్రాసి పంపించే లాగున ఆజ్ఞాపించియున్నారు అయితే యీ వూళ్లో రూ॥ 1 కి శే 12 బియ్యమున్ను రూ 1 కి జొన్నలు శే 18 యీ ప్రకారం ధారణ వున్నది. బీదవాండ్లు విస్తారముగానుండిన మంచిసేళ్లు అన్నము పెట్టేవాండ్లు లేనందున మిక్కిలి జీవశ్రమను పొందుతూవున్నారు. వర్షములేనందున దొరకక వాటికిన్ని శానా శ్రమపడుతూ వున్నారు. ఇక్కడ వుండే కలెక్టరు మేస్తరు బేకన్‌దొరవా రొకధర్మపట్టి యేర్పరచి ప్రతినెలకు ఎవరైనా బీదవాండ్లకు సహాయముచేసేవాండ్లాపట్టీలో వేయివలసినదని తాను నెల 1 కి రు 10 లు యిస్తానని వేసి దానికింద కొంతమంది దొరలున్ను యింతా కొంతమంది నల్లజనమున్ను తమశక్తిమాత్రం వేసి వున్నారు. ఆ అయివజు నెల 1 కి రూ 50 లు జమ అవును. ఇందుకు లంగరుఖానా ఒకటి యేర్పరచి 30-40 బీదవాండ్లను ఒక

జాబితా వ్రాసి వారికి వారాని కొకదినము సదరు ప్రకారం నెలకురాబడి అయివజుకు తగు మాత్రం ఖర్చు చేస్తూ వున్నారు అదృష్టవశాత్తు ఆ జాబితాలో దాఖలు కాబడిన జనం గాక మిక్కిలి విశేషంగావున్న బీదవాండ్లకు అలంగరుఖానా నుంచి యేమి ఉపయోగంలేదు ఈ బస్తీలో వుండే పుణ్యాత్ములైన కొందరు భిక్షము పెట్టేటందువల్ల వాండ్ల జీవనానికి కొంత ఆధారమవుతూ వున్నది. ఈ పట్టణములో బహుజనము నిరాధారంగా అన్నములేక బహుశ్రమపడుతూ వున్నారు. భాగ్యవంతులైన వారికిన్ని ప్రభువులైనవారికిన్ని వాండ్లమీద కరుణ వుంచి జీవనానికి సహాయము చేయవలెనని బుద్ధిలేనందువల్లనున్ను వాండ్లకు సహాయము చేయవలెనని బుద్ధికలిగినవాండ్లకు సదరు జనాన్ని సంరక్షణచేసే శక్తిలేనందున వాండ్లకోరిక ప్రయోజనము లేకపోవుటచేతనున్న బహు జనం అత్యంతమైన శ్రమపడుతూ వున్నారు. ఇట్టి సమయములో వారి సంరక్షణచేసిన వానికి విశేషమైన కీర్తిపొందడమే గాకుండానున్ను ఈశ్వరుడు వానిని సకల రీతుల సంరక్షణచేయునని తోచుచున్నది. అయితే వాండ్ల సంరక్షణ నిమిత్తము ప్రతినిత్య మింతవ్రయమగునని వ్రాయడానకు నిబంధన యేర్పడ నేరదు. ఆఖరుకు నిత్యం 4-5 రూపాయీల మాత్రము ఖర్చుచేసి అన్నం పెట్టించినా జీవనం నిమిత్తం శ్రమపడే బహుజనానకు శానా సహాయమగును. ఆ ప్రకారం వ్రయముచేసి వాండ్లను సంరక్షణచేయడము తమకు సంతోషముగానున్న పక్షమందు తమ ద్రవ్యము నిరర్థకముగా వ్రయము కాకుండా జాగ్రత పెట్టి జరూరుగా కావలసిన అన్న పేదలకు అన్నము పెట్టించే విషయములో నన్నుంచి ఆయ్యే ప్రయాసలు వెలితిలేకుండా జరిగించడానకు నాకు చాలా సంతోషముగా నున్నది. ఆ సంగతి తమకు వివరంగా తెలియడానికి నెలనెలకు అందుల వివరగతి లెఖ్ఖ కూడా పంపిస్తూవుంటాను. గనుక వున్న సంగతి చిత్తానకు వేద్యంచేసినాను.

4. మన బంగళా తోట యావత్తు ఖబర్దారీగానే కాపాడుతూవున్నాను. బంగళా మొదలైన వాటికి కొద్దిగా మరమ్మతు చేయించవలసిన జరూరు వున్నందున చేస్తున్నాను. ఈ నెల ఆఖరున అందులవివరము యావత్తూ శ్రుత పరుస్తూవున్నాను అంతు అయిదు కలములు దివ్యచిత్తానకు తెచ్చి కాపాడగలందులకు తాము ఖామందులు వున్నారు.

అ॥ కృష్ణారెడ్డి నాజరు

1833 సం॥ మార్చి నెల 25- తేది.

[ఈ లేఖ పూర్తిగా కడప జాబులు (S.V.U.) గ్రంథంలో ముద్రింపబడినది.]

[ఆంధ్రపత్రిక (డైలీ) 12-3-1944]

# ముఖస్తుతికి ఏవగింపు

## బ్రౌనుదొర తత్వము

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్‌దొరగారి సముఖానకు – కుంభకోణమునుంచి యీ చెన్నపట్నముతో చేరిన కొల్లావారి అగ్రహారంలో వచ్చి వుండే వరదాచారి అతి వినయంతో సలాము చేసి వ్రాసుకొన్న మనవి యేమంటే—

నేను నిండా పేదవాణ్ణి గనుక జీవనానికి యేమిన్ని ఆధారములేక యీ పట్నములో వసించి యుండే పెద్దమనుష్యులను అనుసరించి యేదైనా జీవనము కల్పించుకోవచ్చునని తలచి యీ రాజధాని చేరి యెటువంటి పెద్దమనుష్యులను ఆశ్రయించినప్పటికిని వాండ్లు పేదవాణ్ణి సంరక్షణచేసేటట్లు యెంతమాత్రమున్ను అగుపడలేదు. అయితే యేలినవారు యేలాగున సమస్త చరాచరాదులను సంరక్షణ చేస్తున్నారో ఆలాగున పేదవాండ్లను సంరక్షణ చేసేటటువంటి బిరుదును తాము వహించి బహుమందిని సంరక్షణ చేస్తున్నారనే కీర్తిని అనేకుల వల్ల తెలుసుకొని దానివల్ల నాయొక్క లేమిడి అనే వ్యాసంగమును విడిచి, యెప్పుడు తమ దర్శనం అవు నని సదా స్వామివారిని ప్రార్థిస్తున్నాను. గనుక నాకు భేటియిచ్చి నాయొక్క మనవి చిత్తగించి పైన వ్రాసిన ప్రకారం తాము వహించియుండే దీనసంరక్షణ బిరుదును నాయందు వుంచి నాయొక్క దరిద్ర మును పోగొట్టి యేదైనా వొక జీవనం దయచేయించి సంరక్షించవలెనని 'దైవం పురుషరూపేణ' అనే వాక్యం ప్రకారం యేలినవారి స్వరూపమైన తమను చాలా ప్రార్థింపుచున్నాను. వేరే రక్షకులు యెవరున్నూ లేరు. చిత్తగించవలెను.

1851 సం॥ జూలై నెల 16 తేది. వరదాచారి.

బ్రౌనుదొర ముఖస్తుతులకు ముచ్చటపడడు. ఈ జాబు క్రిందనే బ్రౌను దొర వ్రాసియుంచిన నోటు యిది:

Johnson's life of Swift – Page 401.

"The love of ease is always gaining upon age and Swift had one temptation to petty amusements, peculiar to himself, what ever he did he was sure to hear applauded; and such was his predominance over all that approached, that all their applauses were probably sincere. He that is much flattered soon learns to flatter himself; We are commonly taught our duty by fear or shame; and how can they act upon the man who hears nothing but his own praises"—

౨

శ్రీమద్వేదశాస్త్ర - యితిహాస - పురాణ పరిశోధకు లయిన శాంత శమ దమా ద్యనంత కల్యాణగుణ పరిపూర్ణులయిన, దేవబ్రాహ్మణ పూజాది విధేయు లయిన రాజమాన్య రాజపూజితులైన మహారాజరాజశ్రీ శ్రీమాన్ సి. పి. బ్రౌన్‌దొరగారికి తమ సేవకుడు సి. రంగనాయకులు (తాళుం తడుక్కై యుంకూప్పి) అని ద్రావిడ వేద ప్రమాణము చెప్పున అనంతదండముల సమర్పించి వ్రాసుకునే విన్నపములు. తమకు ముందుగా వొక పిటీషన్ వ్రాసుకొన్నాను. అందులో నే నారుజనులుగల కుటుంబమును కలిగియుండుట వలన నా కుటుంబమును పోషించుటకు శక్తిలేక యుండుటవలననున్ను, యిక మీదు నే నాకుటుంబము నుంచుకొని యెట్లా జీవించ పోమన్నాననే దిగులు బుట్టినందు వల్లనున్ను తమయొక్క సన్నిధికి వచ్చి నాకొక యుద్యోగమునిచ్చి రక్షించేటట్టు తమయొక్క ఘనాన్ని మిక్కిలి ప్రార్థించి వ్రాసుకొన్నాను. అది మొదలు డిసంబరు నెల ౧౨ తేది వరకు సుమారు రెండు మాసములు ప్రతిరోజున్ను యుదయకాలమందు ౪ గంటలకు చేరి తమయొక్క సన్నిధికి వచ్చి శేవించుకొని పోతూవుంటిని. యీ డిసంబరు నెల ౧౨ తేది వగులు నాకు జ్వరమున్ను, దగ్గున్ను కనిపించి అందువల్ల నిండా శ్రమపడి ఆవల ౨౮ వ తేది ౧౬ దినములకు స్వస్థమైనది. అటు పిమ్మట ౩౧ తేది బుధవారం రాత్రి ౯ గంటలకు పడుకొని రేపు జనవరి నెల మొదలు తేదీగానున్ను, గురువారం మంచివారముగానున్ను వున్నది కాబట్టి రేపు మొదలుకొని దొరగారి సన్నిధికి పోయి శేవించుకొని రావలసినది అని మిమ్ములను నిండా ధ్యానించుకొని నిద్రపోయినపిదప, నిశివేళ

రాత్రి ౧_౨ గంటలకు నా స్వప్నమందు పరబ్రహ్మమైన శ్రీకృష్ణమూర్తి శంఖు-చక్రం - గద - యీ యాయుధముల ధరించుకొని విలక్షణంగా ద్వాదశతిరు మణులు చాతుకొని పీతాంబరం కట్టుకొని యింతంతని చెప్పకూడనటువంటి ప్రకాశముతో నాయొక్క కుడిపార్శ్వమందు వచ్చి నిలిచి - వరే - అని నన్ను తట్టిలేపి "నీవు రేపు యుదయాన ధారగారివద్దకి పోవలెనని నీ మనసులో ధ్యానించుకొని యున్నావే-ఆ ప్రకారం నీవు ధారగారివద్దకి పోవద్దు. నీవద్ద 'సారార్థ సంగ్రహమ'ను గ్రంథ మున్నదే యా గ్రంథమును వేరే కాగితములు తీసి చక్కగా వ్రాసిన తర్వాత నీవు ధారగారి వద్దకి కొంచపోయి సమర్పించి సేవించుకుందు లే, గాని యింతకు ముందు పోవద్దు' అని ఆజ్ఞాపించి పోయిరి. అటు పిమ్మట లేచి ఆజ్ఞ యిటువంటిదా యని యెంచుకొని, ఆ ప్రకారమే మరునాడు కాగితములు తీసుకవచ్చి యా గ్రంథమును వ్రాసి తమకు తెచ్చి సమర్పించి సేవించుకొన్నాను. వొకవేళ మీరు నావద్ద యీ గ్రంథము లేకనా తెచ్చియిస్తివని నామీద కోపము చేసుకొనే పక్షమందు నేను ప్రమాణముతోటి చెప్పుతున్నాను. మీరు సకలమైన వేద శాస్త్ర యితిహాస పురాణములు శోధించి చూచినారు. మీవద్ద సకలమైన గ్రంథములున్నవి. యీ సారార్థసంగ్రహ మను గ్రంథమున్ను యున్నది. దేవుడు ఆజ్ఞాపించిన ప్రకారం వ్రాసి తెచ్చి మీకు సమర్పించి సేవించుకొన్నాను. యింతేకాని మరి వేరే లేదు మరియు. నేను యీ కుటుంబము నుంచుకొని పడే శ్రమ యింతింతని చెప్పకూడదు. (Pity the God did not happen to know that I already possessed this poem- నావద్ద యీ గ్రంథ మున్నదని దైవము తెలుసుకోలేకపోయినా దని విచారించుచున్నాను.) మిమ్ములనే నాకు దిక్కనిన్ని, రక్షకులనిన్ని సత్యంగా నమ్మియున్నాను. యెట్లాగంటే ప్రహ్లాదచరిత్రలో యుండేటటువంటి పద్య దృష్టాంతములు చెప్పుచున్నాను.

ఉ. "ఎన్నడు మాకు దిక్కు గల
దెన్నడు దైత్యునిబాధ మాను నే
మెన్నడు వృద్ధి బొంద గల
మెవ్వడు రక్షకు డంచు దేవతా

కిన్నర సిద్ధ సాధ్య ముని
ఖేచర నాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరిభవ
బంధవిమోచను పద్మలోచనున్.''

అని దేవతాగణము లంతానున్ను ఆ శ్రియఃపతిని ఆశ్రయించి యేట్లా మొరబెట్టిరో-ఆ ప్రకారమే యెప్పుడు నాకు దిక్కు కలగపోచున్నది, యెప్పుడు అన్నానికి శ్రమపడుతాననే బాధ మానిపోచున్నది అని ప్రలాపించి మిమ్ముల యాశ్రయించి మీ పాదములలో వచ్చిపడ్డాను. యింకా మీ రెటువంటివారంటే-క. ''గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునన్, గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్.'' అని యుప కారము మొదలయిన యనేక సద్గుణములను యింత అంత అని లెఖ్ఖ పెట్టుట కున్ను చెప్పుటకున్ను యెవరికిన్ని శక్యము లేదు. యిటువంటి సద్గుణములు కలిగిన మిమ్ములనే, క. ''బలయుతులకు దుర్బలులకు, బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్, బలమెవ్వడు ప్రాణులకును, బల మెవ్వం డట్టివిభుడు బల మసురేంద్రా!'' అని యేయొక్క ఆధారమున్ను, బలమున్ను లేనివారికి మీరు బలంగా యుండేటందువల్ల- యటువంటి మీరు నాకునున్ను బలం- ఆధారం మీరు దప్ప వేరే ఎవరున్ను లేదు. యింకానున్ను క. ''దిక్కులు కాలముతో నే, దిక్కున లేకుండు గలుగు దిక్కులుమొదలై, దిక్కుగల లేనివారికి, దిక్కెయ్యది నాకు నదియె దిక్కు మహాత్మా!'' అని పేదలకంతానున్ను మీరే దిక్కుగా యుండేటందువల్ల నున్ను నావంటి దిక్కులేని వారికిన్ని మీరే దిక్కని నిండా నమ్మి యున్నాను సత్యంగా నాకు మీరేదిక్కు, యింక యెవరు లేరు.

యిదిగాక నాకు తెలుగున్ను, అరవమున్ను, ఇంగ్లీషున్ను వ్రాయను చదవను తెలుసును. మరియు యింగ్లీషు లెక్కలున్ను బాగా తెలుసును. చక్కగా లెఖ్ఖవేయగలను. వీటిలో యెందులోనైనానున్ను వొకపని యిచ్చినన్ను రక్షించ వలయునని తమయొక్క పాదారవిందమును ఆశ్రయించి శరణుజొచ్చినాను. యిదిగాక, శ్లో॥ ''శంఖు-చక్ర గదాపాణి, ద్వారకానిలయాచ్యుత, గోవింద పుండరీకాక్ష, రక్ష మాం శరణాగతం.'' అని ద్వారకలో వుండే శ్రీకృష్ణుని ద్రౌపదీదేవి ధ్యానించుకొని శరణువేడిన మాత్రములోనే శ్రీకృష్ణుడు యెట్లా

అక్షయవల్వాలిచ్చి రక్షించిరో-ఆ ప్రకారమే నేనున్ను యీ భూలోకమందు మీరే నాకు రక్షకులనిన్ని, దాతయనిన్ని, తండ్రియనిన్ని, దేవుడనిన్ని, మిమ్ములను నమ్మి ధ్యానించుకొని శరణుజొచ్చినాను. నన్ను యే విధాననైనా రక్షించేది మీ భారంగా వుంటున్నది. నేను మిమ్ములనే సత్యంగా శరణుజొచ్చినాను. నా యొక్క నివాసస్తళం యేనిగగెవునివద్ద భద్రయ్యతోట సందులో కాపురస్తుడైన తమయొక్క నిండా అణకువగల సేవకుడను.

సి. రంగనాయకులు

చెన్నపట్టం 1852 సం॥ జనవరి నెల॥ 8-వ తేది.

[ఆంధ్ర పత్రిక (దినపత్రిక) 21-5-1944 ]

# బ్రౌన్ దొరనాటి దయ్యాల వృత్తాంతాలు

*[నిత్య నవీనములూ, గమనార్హములూ అయిన విషయాలను గురించి రికార్డులలోనుండీ, జాబులు, కైఫీయతులు మొదలైన వాటిలో నుండీ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పర్యవేక్షణ క్రింద సేకరింప బడిన రచనలలో ఇది యొకటి.]*

గంగవరము అనే వూరిలో వొక కాపువాడు రొంపిదుక్కి దున్నుతూ వుండగా అస్తమానమైనది. మబ్బు కమ్ముకొన్నది. పొడిపొడి చినుకులు రాలుతున్నవి. అప్పుడు ఆ కాపువాడు యెద్దులను విడిచిపెట్టి కాడి రొంపిలో నాటి, ఆ కాడికి యెగవవుండే తొలిలో ముండ్లకోల అడ్డముగా దోపి ఆ యెద్దులకు గట్టిన మోకులను చుట్టలుచుట్టి ఆ కర్రకు యివతల అవతల తగిలించెను. వొక చింపి కంబడిని చినుకులకు అడ్డముగా ఆ కాడిమీద వేసెను. అటువెనుక వాడు యింటికి పోయెను. ఆ సమీపమునందు ఒక పల్లెలో నుంచి వొక బ్రాహ్మణుడు రాత్రి చీకటివేళ వొంటిగా ప్రొద్దుపోయి ఆ దోవనే గనిమెమీద, బురదచేత కాళ్ళు జారుతూవుండగా, నడుమనడుమ మెరసినపుడు దిక్కులు చూస్తున్నూ వచ్చెను. అక్కడ యీ కాడి వొక దయ్యమనిన్ని, దాని నెత్తినవుండే చింపికంబడి విరియ బోసుకొన్న తలవెండ్రుకల జడలనిన్ని, ఆ కర్రకు రెండు ప్రక్కల తగిలించిన మోకులు గాలికి కదలాడగా, అవి దయ్యపు చేతులనిన్ని భ్రమసి, ఆ గాఢాంధకారంలో భయపడి కేకవేసి అంతలో ధైర్యము తెచ్చుకొని తనచేతికర్రచేతను తన బలముకొద్ది ఒకదెబ్బ తీసెను. ఆ దెబ్బ ఆ కాడిమీద తగిలి టక్కున ధ్వని వినిపించెను ఆ ధ్వనిని, ఈ బ్రాహ్మణుకు ఆ దయ్యముచేత వుండే ఆయుధపు దెబ్బ అని దిగులుపడి బురదలో బోర్లపడెను ఆ కాడి అటుపక్క బురదలో తటాలున పడెను. ఆ ధ్వనివిని తనమీదికి గంతువేసే దయ్యపు కాళ్ళ చప్పుడని బ్రాహ్మణుడు మూర్ఛపోయెను. అటువెనుక కొంతసేపటికి, మబ్బు విడిచి, చంద్రోదయమై వెన్నెల రాగానే యీ బ్రాహ్మణుడు లేచి దిగులుపడుతూ నాలుగు పక్కలా చూచి, దయ్యము తన్ను వదలిపోయినదని మనస్సులో యోచి

ఆ గనిమెమీద యెక్కి ముందర చూడగా ఆ కాడి ఆ బురదలో దోవదగ్గిర పడి వుండెను. తనచేతికర్రయున్ను అక్కడ వుండెను. ఆ కర్ర తీసుకునేటందుకు దాని దగ్గఱకు పోయి ఆ కాడిని చూచెను. వొకవేళ యీ కాడే మనకు చీకట్లో దయ్యముగా అగుపడెనోయేమో అని విచారించి కాడియెత్తి యథాప్రకారముగా బురదలో నాటెను. మునుపటివలెనే కాడితొలిలో కర్ర చొప్పించి, రెండు ప్రక్కల మోకుతాళ్ళు వేలాడవేసి, ఆచింపికంబడి బురద పోయ్యేటట్టుగా ఝాడించి ఆ కాడి మీద కొట్టెను. అటువెనుక ధైర్యముగా దానిదగ్గర నిలుచుండి చూచెను. "ఓహో! నేను భ్రమిస్తిని. యిది దయ్యము కాదు. యిక యెవరైనా యీ దోవసువస్తే వారు యీలాగుననే భయపడుదు''రని, వాటినంతా యెత్తుకొని యివతలి వూరికి వచ్చెను. ఆ వూరి దగ్గర వొక గుంటలో నీళ్ళువుండగా చూచి అందులో వీటినంతా వేసి, స్నానముచేసి, యింటికిబోయి, తడిగుడ్డ విడిచి, వేరేగుడ్డలు కట్టుకొని, అప్పుడు తనవారితో యీ వృత్తాంతమునంతా నవ్వుతూనున్ను, వారిని నవ్విస్తూనున్నూ చెప్పి, 'లోకములో దయ్యములన్ని యిటువలెనే భయపడేవారికి అగపడును. గుండెదిటవు గలవారికి దయ్యములేదు' అని సిద్ధాంతము చేసెను. మర్నాడా కాపువాడు దున్నేటందుకు పోయి అక్కడ తాను నాటిన కాడి మొద లయినవి లేనందున ఆ వూరి అచ్చు కావలివానితో చెప్పెను. వాడు జాడలు విచారించి, ఆ గుంట దగ్గర పోబడిచూచి యీ బ్రాహ్మడి అడుగుల జాడపట్టి, యీ బ్రాహ్మడ్ని అడగగా, ఆ గ్రామస్థులను అందరినీ నడివీధిలో గుంపుగూర్చి యీ కథంతా సవిస్తారముగా జెప్పి అందఱిని నవ్వించి, ఆ కావలివాడితో ఆ కాడి మొదలయినవి ఆ గుంటలో పడవేసినానని చెప్పెను. అటువెనుక ఆ సంసారి అవి తీసుకపోయి దున్ని, మునుపటి వలెనే ఆ బురదలో నాటి రాత్రి యింటికి వచ్చెను. అటువెనుక ఆ వూరివాండ్లు ఆ దోవనే కొందఱు వచ్చి, దాన్నిచూచి యెవ్వరూ భయపడలేదు. ఆ బ్రాహ్మడి మాట తలచుకొని ఆశ్చర్యపడిరి. ఇది చోద్యమైన వృత్తాంతము.

## 2

శ్రీ పెరుంబూదూరులో ఆసూరి పెరియ అప్పంగారి యింట్లో దెయ్యముల వుపద్రవం కలిగి, ఆ యిల్లును వారు చాలించుకొన్నందున పాడుగా వున్నది. ఆ

దయ్యములచేత కలిగిన వుపద్రవములు యేలాంటివంటే, సాయంకాలము యింట్లోకి వడ్లు తీసుకవచ్చి, వకమూల పోసిపెట్టి, మరునాడు వుదయాన ఆ వడ్లని యెత్తబోతే అవి అమేధ్యముతో కలిసివుండేవి భోజనం చేస్తూవుండగా పైనుండి వెంద్రుక చుట్టలున్ను, బొగ్గులు, అమేధ్యం మొదలయినవి విస్తట్లో పడేవి. రాత్రి పూట మనిషి పోతూవుండగా ఒక మనిషి దబదబ పరిగెత్తి ఒక యింట్లోనుంచి మరివక యింట్లోకి పోయేటట్టు కనుపడేది. యీలాటి ఉపద్రవములచాత ఆ యింట్లో కాపురము చేయడమును యీ పన్నెండేండ్లుగా మానుకున్నారు. ఆ యిల్లు పాడుగా నున్నది.

[ఆంధ్ర పత్రిక (దిన పత్రిక) 23-4-1944]

# బాట తప్పిన బండి

—డా॥ వేటూరి శంకరశా

[పూజ్యులు శ్రీ శంకరశాస్త్రిగారు ఎంతో వ్యథ చెంది కొన్నేళ్ళ క్రితం వ్రాసిన వ్యాసానికిది క్లుప్త పాఠం. ఆవేదనతో వారానాడు (1975) బంగోరే బ్రతికుండగానే వ్రాసినా, అప్పుడా వ్యాసాన్ని భారతి వారెందుకో ప్రకటించలేదు - ఇప్పుడైనా మేమడిగితే సందర్భం వచ్చింది గనుకా, చెప్పవలసింది చెప్పడం తప్పుకాదు కాబట్టి దానినెంతో నిగ్రహంతో సంగ్రహపరచి మాకొసగినారు.

బంగోరే నేడు లేడు. ప్రభాకరులతోగానీ బ్రౌన్‌కు సంబంధించి వారు ప్రకటించిన, సంపాదించిన అనేకానేక విషయాలతోగానీ అతడికి ఏమాత్రమూ పరిచయమున్నట్లు కానరాదు. వాటి పరిచయముగానీ పరిశీలన గానీ వుండివున్న వారెవరూ అలా వ్రాయరు.

బ్రౌన్ విషయమై అతనికున్న ఔత్సుక్యాన్ని మెచ్చినవారు కూడా ప్రభాకరుల విషయమై ఆతడానాడు వ్రాసిన వ్రాతలను హర్షించ లేక పోయినారు. ఎంత నిజమో తెలియదుగాని ఆతనితో సన్నిహిత పరిచయం గల యువమిత్రులిద్దరు మాతో అన్నారు - చివరి రోజులలో ఖేదపడి ప్రభాకరుల వ్యక్తిత్వాన్ని గ్రహింపలేక పరుషంగా వ్రాసినందుకు పస్తాయించినాడని! - శ్రీ రామకోటయ్యగారి 'మా శాస్త్రిగారు' గ్రంథం చదివిన మీదట అతనిలో అట్టి పరివర్తన కలిగిందని! అప్పుడైనా ఆతడు వారి వ్యక్తిత్వాన్ని పరోక్షంగా కొంత గ్రహించి వుండవచ్చును గానీ తెలుగు దేశాన బ్రౌన్ వాఙ్మయ పరిశోధనకు ప్రభాకరులే ఆద్యులన్న విషయాన్ని గుర్తించి వుండక పోవచ్చును.

బ్రౌన్ - ప్రభాకర పండితుల వర్ధంతిని పురస్కరించుకొని వెలువడుతున్న మా యీ మణిమంజరిలో పాఠకులీ విషయాన్ని పరిశీలించ గలరు - సం॥]

'బంగారే రొ్రిడిగో' అనే పేరు గల ఒక క్రైస్తవ మిత్రుడు 1920 లో, మదరాసు ఆయుర్వేద కళాశాలలో నాకు సహాధ్యాయిగా ఉండేవాడు ఆయన శ్రీలంక నివాసి (అప్పుడు సిలోన్). అతడు సంస్కృత భాషయందు గట్టి పండితుడు అతని సంగతిలో నేను యెన్నో విషయాలు తెలుసుకో గలిగి నాను. నామ సామ్యాన్నిబట్టి "బంగోరే" అనే పేరు వినగానే వీరు కూడా అట్టి గట్టి పండితుడే. విదేశీయుడు, వచ్చి బ్రౌన్ దొరను గూర్చి పరిశోధన జరుపు తున్నారేమో నని సంతోషించాను. తీరా విచారిస్తే వీరు బండి గోపాలరెడ్డిగారని తెలిసింది. బ్రౌన్ దొరయందు నాకుగల గౌరవ భావాన్ని పురస్కరించుకొని, 'బంగోరే' గారి రచనలను మిత్రుల సహాయంవల్ల ఇటీవల చదవగలిగినాను. వీరు యధేచ్ఛగా వాడుకభాషలో దుడుకుగా గ్రంథరచన సాగించగలిగిన సమ ర్థులు. తగ్గట్టుగా వీరు తమ గ్రంథం ముందుమాటల్లో ఈలా అంటున్నారు : "ఆవేశాన్ని ఆవేగాన్ని చిక్కబట్టుకొని వ్రాయడంలో యెంతగానో యాతన పడేవాణ్ణి. ఇప్పుడూ అదే అవస్థ యెదురైంది." నిజమే! గ్రంథం స్థాలీపులాక న్యాయంగా చదివి చూచినా వీరు ఆవేశపూరితులనీ, ఆవేగాన్ని ఆపుకోలేని వారనీ, విశృంఖలంగా రచన చేయగల వారనీ వీరి అవస్థ అర్థమౌతూనే ఉంది. అయితే చరిత్ర రచయితలకు, పరిశోధకులకు సత్యాన్వేషణపరులకు ఆవేశాలు, ఆవేగాలు తగవు గదా ! కవుల పరంగా ఇవి రాణించగలవేమో ! చరిత్ర రచ నకు సహనం, సత్యనిరతి, రాగద్వేషరహితమైన సమదృష్టి, పరినిష్ఠితమైన పాండిత్యం, పూర్వాపరసందర్భాలను సమన్వయపరచగల వివేచన యెంతైనా అవసరం. ఇట్టి వారి రచనలే చారిత్రకంగా రాణించగలుగుతవి. వెనుక ముందులు చూచుకోకుండా, చేతికివచ్చినట్లు, బుద్ధికి తోచినట్లు వ్రాయడంవల్ల, పండితులను, పరిశోధకులను తూలనాడడంవల్ల సాధించగలిగేది ఏమీ ఉండదు సరిగదా, సరియైన చరిత్రాంశాలు మరుగున పడిపోయి రచయిత దుడుకుతనమే బహిర్గత మౌతుంది. ఏదీ పరుషముగా వ్రాయక, సరళముగాను, సరసముగాను వ్రాయడం ఒక నేర్పు. ఆలా వ్రాస్తే చదువరులును ఉద్వేగపడక, సదసద్వివేచనతో విషయావగాహన చేసుకొని సంతోషించగలుగుతారు. వీరి గ్రంథాలలో ప్రసంగ వశాత్తు తల నెరిసిన పండితులను, పరిశోధకులను వ్యంగ్యంగా చెణుకుతూ వచ్చారు. 'ప్రమాదో ధీమతామపి' ఒకరు పొరబడవచ్చును మరొకరు పొరబాటును దిద్దవచ్చును. దుడుకుతనంతో దూషించడం వివేచన గలవారు చేయరు.

సుగృహీత నామధేయులు, పండితులు, పరిశోధకులు, ప్రామాణికులు అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి మీద, అకారణంగా వీరు మరీ విరుచుకు పడ్డారు. ప్రఖ్యాతులైన వీరేశలింగం గారిని కూడా విడువలేదు ఎందుకో!! 'దళారి', 'చోరుడు', 'దగా' అనే మాటలతో వారిని నిందిస్తూ, ఆవేశపూరితులై చేయరాని పాపం చేశారు. ఇది తగని పని.

శ్రీ ప్రభాకరశాస్త్రి గారి ప్రతిభాపాండిత్యాలు, స్వరూప స్వభావాలు, నీతి నియమాలు, నిత్యకృత్యాలు వీరు స్వయంగా యెరుగనివారని నాకు తెలుసును. ఎందుకంటే, వారితో వీరికి ఏమాత్రం పరిచయభాగ్యం వున్నా, వీరీ విధంగా వ్రాయడానికి చేతులాడేవి కావు. రచన అంటే వారు అసిధారావ్రతంగా భావించే వారు. సత్యాన్వేషణ దీక్షతో విషయ పరిశీలన జరిపి, ఆచి ఆచి, తూచి తూచి, వారేదైనా సరే మౌలికంగా వ్రాసేవారే గాని, ఆధార రహితమైన కల్లబొల్లి వ్రాతలు వ్రాసేవారుకారు. పైగా అట్టి వ్రాతలు వారికి నచ్చేవీ కావు. వారి వ్రత విధాన మిట్టిదిగా నుండెడిది :

''తలపులు విశుద్ధములుగా
దలపింపుము పలుకు లమృత ధారలనంగా
పలికింపుము కార్యమ్ములు
సలిపింపుము పరహిత ప్రశస్తమ్ములుగాన్.

ఇతరుల నవమానించెడి
మతిమాన్పుము పరుల చెడ్డమాటలు సైపన్
ధృతిగూర్పుము సంతోషా
మృతరసమిడి సేదదేర్పుమీ నా స్వామీ !

నేను కారణముగ నెవ్వడేని సంక
టం పడని రీతి నన్ను వర్తింప జేయు
మాగ్రహ మసూయ గర్వమిత్యాదులైన
చెడుగు లుడిగింపుమిక నన్ను జెందకుండ.

పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నా
విరచనలందు, డెందము పవిత్రముగా విలసిల్లి సత్య సుం
దరము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింపగాపలెన్
గురుచరణారవిందములకుం బ్రణమిల్లెద నట్టి నేర్మికై."

ఇదీ వారి ప్రార్థన. ఈ విషయములు వారియందు నిత్య సత్య వ్రత ములుగా నుండెడివి.

చాటు పద్యాల సేకరణ అందరూ చేసేపని, చేయగల పని కాదు. ఇందుకు దేశాటనము, పలువురతో పరిచయము, విద్వద్గోష్ఠి, ప్రాచీన తాళపత్ర గ్రంథ పరిశీలన, పరిశోధన అవసరము. అన్నిటికన్న పీటి సంపాదనాసక్తి ఉండడం అవసరం. ఇది ఒకరి సొత్తు కాదు మడికి సింగన సేకరించినా, బ్రౌన్ దొర గారు, ప్రభాకరశాస్త్రి, పిచ్చయ్యశాస్త్రి గారలు సేకరించినా అందరు పడిన శ్రమ ఒకే రీతిగా నుండనేరదు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు ఆంధ్రదేశ మంతటా ప్రాచీన అముద్రిత గ్రంథ సంపాదనార్థమై సంచరించు సందర్భమున దొరకిన ప్రాచీన తాళపత్ర గ్రంథము నెల్ల కన్నులకు చిల్లులు పొడుచుకొని, కలయ వెదకియు, కనుపడిన వారి నెల్ల నడిగియు వారి నిరంతర పరిశోధన కందిన అనేక విషయములనెల్ల సమకూర్చుటయే గాక, మరుగున పడియున్న చాటువు లను, చరిత్రాంశములను సేకరించి, కథా సందర్భములను, కవుల కాలమును నిర్ణయించి అనుపూర్వితో గ్రంథముకు సమకూర్చి, 1913, 1917, 1922, 1950 సం॥లలో రెండు మూడు సంపుటములుగా చాటుపద్య మణిమంజరిని ప్రచురించియున్నారు. కలము కాగితము చేబూని కల్పనలతో కవిత్వము చెప్పుట వంటిదిగాదు ఈ పని; లభించినంత వరకు కవులపేర్లు, కథా సందర్భ ములు వివరించి, చదువరులకు గ్రంథస్థ విషయములంను అభిలాష రేకెత్తించు నట్లు గ్రంథమును సంధానించి ఇప్పటికి అరువది డెబ్బది యేండ్లకు పూర్వమే ఆంధ్రలోకమున కర్పించియున్న శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వైదుష్యమును, పరిశోధన పాటవమును, ప్రామాణికతను బంగోరేగారు శంకించుచున్నారు. 'గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించి' నట్లున్నది ఈ పని. చాటు పద్య మణిమంజరి ప్రథమ భాగమునందే బ్రౌన్‌దొరగారు అనే శీర్షికను శ్రీ శాస్త్రిగారిట్లు వ్రాసినారు:-

"ఆంధ్రభాషకై యతి ప్రయాసపడి, మహోపకృతి సల్పినవాడు, బందరు మొదలగు పట్టణము లందీతడు జిల్లా జడ్జీ ఉద్యోగమును సల్పుచు ననేక సంస్కృతాంధ్ర గ్రంథములను బహుధన వ్యయమున సేకరించెను. తెల్గునకు నిఘంటువుల నిర్మించెను. జూలూరి అప్పయ్య పండితుడు, గురుమూర్తి శాస్త్రి, వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రులు మొదలగు ననేక పండితుల నాదరించి విరివిగా ధన మొసగెను. ఆంధ్ర భాషయందీ ఘనున కత్యంతాభిమానము కలదు. ఇప్పుడు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న సంస్కృతాంధ్ర గ్రంథము లనేకము లిమ్మహనీయుడార్జించినవే; ఈతని యాంధ్ర భాషాభిమానమును బుద్ధి వైభవమును దద్భాండాగారమున గల గ్రంథములను బట్టి గు రింపనగును."

ఇంకా పలుచోట్ల సందర్భవశాత్తు శ్రీ శాస్త్రిగారు బ్రౌన్‌దొరను గూర్చి, వారి పరిశ్రమను గూర్చి, పండితాదరణమును గూర్చి ప్రశంసిస్తూ వ్రాసిన సంగతి మిత్రులు శ్రీ సుందరేశ్వరరావు గారు (జూన్, జూలై) భారతి సంచికలో వెలువరించే ఉన్నారు.

విషయ మీలా ఉండగా బ్రౌన్‌దొర గారిని గూర్చి వ్రాస్తూ తామేదో పొడిచి గెలిచినట్లు బంగోరేగారు ఇట్లా అవాక్కులు వ్రాశారు:

"ఇంతవరకు ఆయన (బ్రౌన్) చేసిపెట్టి పోయిన పనిని ఎవరూ చూడలేదనుకోవాలి. అథవా చూచినా ఎందువల్లనో బయటపెట్టలేదనుకోవాలి. బ్రౌన్ గతించిన తర్వాత కనీసం కృతజ్ఞతగానైనా ఆ పేరు ప్రఖ్యాతులను ఆయనకు చెందకుండా చేశారు మనవాళ్లు. వేటూరి ప్రభాకరశాస్త్రి, కందుకూరి వీరేశలింగం వంటి ప్రఖ్యాత సాహిత్యవేత్తలు."

ఈ వ్రాతకేమైనా అర్థం కాని, విలువ కాని ఉందా? ఏ మాత్రం వెనుక చూపు, చరిత్ర జ్ఞానం ఉన్నవారైనా ఈ మాటలు వ్రాస్తారా? బంగోరేగారు నిన్న నేడు వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి పుణ్యమా అని బ్రౌనుదొరను గూర్చి కలం చేతపట్టారు. ప్రభాకరశాస్త్రిగారు ఇప్పటికి అరవైయేండ్ల కింకాపూర్వమే (1913) బ్రౌన్‌దొరగారి ఆంధ్రభాషా సేవను గూర్చి ప్రశంసిస్తూ వ్రాశారు- అప్పటికింకా బంగోరేగారు పుట్టారో లేదో మరి; పేరు ప్రఖ్యాతులు ఆయనకు దక్కకుండా చేశారట! మధ్య వచ్చిన దళారులు కొందరు కొట్టివేశారట! ఎంత యోగ్యతగల మాటలివి! బ్రౌన్‌దొర పేరుప్రఖ్యాతులు ఒకరు కొట్టేశేవి కావు.

బంగోరే వంటివారు ఉద్ధరించేవి కావు. ఆయన పేరు ప్రఖ్యాతులు ఆంధ్రదేశము, ఆంధ్రభాషతో ముడివడి, కలకాలము నిలువగలవి.*

* బ్రౌను తన పండితుల నుండి, ఇతరత్రాను సేకరించిన, లోకంలో ప్రచారంలో నుండిన, చాటుధార పద్యాలను అనేకం భద్రపరచినాడు. అవి చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నవి. ఇవేకాదు, ఆంధ్ర వాఙ్మయ వికాసానికి చరిత్ర పరిశోధనకు, స్థానిక చరిత్రకు పనికివచ్చే మౌలిక సామాగ్రిని కూడా ఆయనెంతో ఉద్ధరించి అక్కడ నిల్పినాడు.

ఆ విషయాన్ని మన దృష్టికి తెచ్చినవారు, ఆ విషయమై పరిశోధనకు పురిగొల్పినవారు మొదట ప్రభాకరులే అన్న విషయం ఎరిగిన వారికి తిరిగీ ఎరుగ చెప్పనవసరం లేదు. ఎరుగని వారి కొరకే మణిమంజరిలో మా యీ ప్రయత్నం. బ్రౌనును, చెన్నపురి పుస్తకశాలను స్మరించియే ప్రభాకరులు ఆయా అంశాలను తమ రచనలలో సందర్భవశాన స్వీకరించారు. ఈ విషయము చెప్పడమూ పునరుక్తే కాగలదు.

బ్రౌను, ఆనాటి పండితులు, సేకరించినట్లే ప్రభాకరులును మరి, ఎన్నో చాటువులను గ్రంథసముపార్జనకై చేసిన తమ దేశాటన సందర్భంలో ఎందరి నుండియో ఎన్ని గ్రంథాల నుండియో సేకరించినారనడానికి వారి చాటుపద్య మణిమంజరి సంపుటములే సాక్ష్యము [మా మణిమంజరి పూర్వ సంచికలలో లేఖలతో సహా అట్టి విషయాలు కొన్ని ప్రచురించినాము]. వాటిని వీటిని చేర్చి, పరిష్కరించి. కథా సందర్భాలను కూర్చి, ఆంధ్రుల అభిమానాన్ని చూరగొనే విధాన వర్గీకరించి, తాము వేసుకొన్న ప్రణాళిక కనుగుణంగా కొన్ని సంపుటాలుగా చాటుపద్య మణిమంజరిని సంకలన పరిచారు- అనడం సత్యసమ్మతం. తద్విరుద్ధంగా బ్రౌను చాటుపద్యాల సంకలనాల్ని యథాతథంగా వేటూరివారు ముద్రించినారనడం ఎఱుక చాలని వంకర మాట. బ్రౌనుని పేర్కొనలేదనడం సత్యాన్ని తఱచి చూడ లేని మంకుతనం.

1911 లో తామీ తీరు పరిశీలనకు పిలుపిచ్చిన పదేళ్ల తర్వాత అట్టి పనికి ఎవరూ చేయివేయని తరుణాన వారే పూనుకొని కొన్నైనా ఇలాటివి ప్రకటించినందుకు హర్షించి కృతజ్ఞతలు చెప్పుకోవాలి- ప్రాజ్ఞులైన వారు! -సం॥

ఇట్టి అవాచ్యములను గూర్చి ఏమనాలో తోచడం లేదు. అవివేకం అంటే చాలు ననుకొంటాను.

ముప్పది ఏండ్లకు ముందు ఇన్ని యూనివర్సిటీలు, తెలుగున కింత మంది ప్రొఫెసర్లు, రీడర్లు ఈ హంగామా అంతా ఉండేదికాదు. చాలీ చాలని జీతాలతో, ఇతర సహాయ సహకారములు లేక, సొంత ఖర్చులతో, స్వయం ప్రతిభతో, భాషాభిమానంచేత ఏది వ్రాయాలన్నా ఎవరికి వారు పడేపాట్లుగానే ఉండేవి. ఒక తాళపత్ర సంపుటానికి కాపీ వ్రాయించాలంటే నెలలు తరబడి వందలు ఖర్చు అయేది. గ్రంథ కర్తలకు గ్రంథ ప్రచురణ దుస్సాధ్యముగానే ఉండేది. ఎటొచ్చీ ఏదైనా ఆంధ్ర దేశాభ్యుదయకరమైన, భాషా విషయకమైన అమూల్య విషయాలు ప్రచురించవలెనంటే ఆనాడు దేశోద్ధారక నాగేశ్వరరావుగారి ఆంధ్ర పత్రిక, భారతి రచయితలకు దిక్కు దివాణములుగా ఉండేవి.

ఇప్పుడైతే ప్రొఫెసర్లకు, రీడర్లకు పుష్కలంగా జీతాలు, బోలెడు గ్రంథ సామగ్రి, పైగా నిపుణుల పర్యవేక్షణ, మైక్రోఫిలుముల కాపీలు, సొంత డబ్బులు ఖర్చులేకుండా గ్రంథ ప్రచురణ ఈ సౌకర్యాలన్నీ అమరినవి. అర్హతానర్హతలు, శక్తి సామర్థ్యాలు లెఖలోకి రావడంలేదు. కొందరు ప్రబుద్ధులు పూర్వపు పండితులు, పరిశోధకులు తీర్చిదిద్ది, అమర్చి, పక్వపరిచి ఉంచిన అధరువులతో వడ్డించిన విస్తళ్ళముందు కూర్చుని భోంచేయడమే గాక పైపెచ్చు పండిత దూషణ కూడాను!

ఇట్టి ప్రబుద్ధులను గూర్చి ఇప్పటికి యాభైయేండ్ల క్రిందటనే ప్రభాకర శాస్త్రిగారు ఈ క్రింది విధముగా విచారము వెల్లడించినారు :-

''ఆంధ్ర దేశమందాంధ్ర వాఙ్మయ పరిశోధన భిక్షముపెట్టి యాంధ్రులకు భాషా ప్రపంచమున బ్రతకుదెరువు జూపిన చిన్నయ సూరియు, సీతారామా చార్యులు నఱవ దేశమువారని నింద. వేలు తప్పులు వ్రాసిరని వెక్కిరింపు. ఆక్షేపించువారు తారెక్కడివారో, తమకెన్ని తప్పులున్నవో చూచుకొన్నగదా! అల్పపు వేతనముతో భుక్తి గడుపుకొనుచు నితర లాభముల నెఱుగక యాయుష్కాలమెల్ల నాంధ్రభాషాభ్యుదయమునకై ధారవోసిన మహనీయులను చిన్నయ సూరిని, సీతారామాచార్యులను దెగడుచున్నవారిని గూర్చి నేను మిగుల

వగచుచున్నాను. చిన్నయసూరిగారు సూర్యోదయకాలమునకు స్నానము చేసి కూర్చుండి ఒకటి రెండేని ప్రయోగవిశేషములను గుర్తింపక భుజింపబోయెడి వారు కాదట! ఇప్పటివలె తగినంత గ్రంథ సామగ్రి దొరకని కాలమున ఒక్క చేతిమీద నిఘంటువులను, వ్యాకరణములను రచించిన పయి పండితద్వయమును దలచుకొన్న నా హృదయము జలదరించును. పండితులను దెగడుటన్న కొందఱ కిప్పుడు పరమానందముగా నున్నది."

* * *

—"ఒంటిమిట్టను కాపురం-బున్నయట్టి
సిద్ధిసానికి సంకల్ప సిద్ధిరస్తు—
...మరొకటి

An epigram written by నక్కలపాల బాలసరస్వతి aganist the head farmer of Cuddapah says:-

"రెడ్లమటంచు క్రొవ్వున చరించి వరాలు గడించి యూరకే
బుడ్లకొలందినించి కడుపు ల్కడుబెంచి వివేకశూన్యులై
యెడ్లవలెన్ చరించుగుణహీనులకెక్కడికీర్తులోరి వి
ద్వడ్లయకాల గోళ్ళ చిన తిమ్మతనూభవ తాతభూవరా"—

ఈ రెండు చాటువులు బ్రౌన్ పేరైనా చెప్పకుండా వేటూరిచోరుడు కాపీ కొట్టి తన చాటుపద్య మణిమంజరిలో ప్రకటించుకొన్నాడు. ఈ దగా మూలంగా చాటుపద్యాలనగానే మనలో చాలామందికి నేడు వేటూరి గుర్తుకొస్తున్నట్లుగా బ్రౌన్ గుర్తుకురావడం లేదు. ఇక్కడ 'head farmer of Cuddapah'అని బ్రౌన్ వ్రాసుంటే వేటూరి దాన్ని బహువచనం చేసేసి కడపరెడ్ల కందరికి అంట గట్టాడు."—

బ్రౌన్ head farmer అని వ్రాయడంవల్ల పద్యంలోని వాక్యనిర్మాణం ఏకవచనంలోకి మారదు కదా! D. 2384 లో ఈ పద్యాన్ని బ్రౌన్ 'కడప రెడ్డిమీద చెప్పింది' అని వ్రాసి వున్నాడు. ఒకరిని గాని కొందరినిగాని మనసులో

ఉంచుకొని, దొరికిన పద్యాన్ని బ్రౌన్ ఉపయోగించుకొని ఉండవచ్చును గదా ! ఇంతకూ బంగోరేగారు ఏకవచన ప్రాసగల పద్యం ఏదైనా ఒకటి వుంటే చూపి గదా, వేటూరివారు దాన్ని బహువచనం చేసేసి కడపరెడ్ల కందరికి అంటగట్టా రనే అపనిందతో కూడినఆక్షేపణ చెల్లుబడికి వస్తుంది; బంగోరేగారు రెడ్డి ప్రభువులు కావడంచేత ఈ పద్యం కొంచెం గుచ్చుకొని వుండవచ్చు. కుల ప్రసక్తితెచ్చి బాధపడుతున్నారు. గుమ్మడికాయల దొంగంటే బుజాలు తడుము కోడం ఇటువంటిదే; రెడ్లను గూర్చి, రెడ్ల ప్రభుత్వాలను గూర్చి శ్రీ ప్రభాకర శాస్త్రి గారికి ఎంతో గౌరవము, మన్నన ఉన్నది. శృంగార శ్రీనాథము (1923)లో ఈలా అన్నారు:—

“మహనీయంబుగ నంధ్ర భూవలయముం బాలించుచుం బ్రాజ్ఞులై
బహుకావ్యంబుల జెప్పుచున్ మఱియు జెప్పంజేయు చాముష్మిక
స్పృహతో ధర్మములాచరించుచు, జగజ్జేగీయమానంబుగా
నహముల్ పుచ్చిన రెడ్డి రాజుల సముద్యత్కీర్తి గీర్తించెదన్.”

రెడ్లరాజ్య ప్రాభావమును గూర్చి, పాండిత్య విశేషములను గూర్చి సవివరముగా ప్రస్తుతించినారు ఆ గ్రంథంలో. సంపన్నులైన, సాహిత్య ప్రియులైన రెడ్డి దొరలెందరో వారికి మిత్రులుండెడివారు. రెడ్లనిందను వారెప్పుడు సహించరు. ఇంకా కావలెనంటే రెడ్డి సంచికలోని ఆంధ్ర పరిశోధక మండలివారి వార్షిక సభలో శాస్త్రిగారొసగిన అధ్యక్షోపన్యాసము చదవండి.

చాటుపద్య మణిమంజరికై శాస్త్రిగారు ఎన్నో పద్యాలను సొంతంగా సేకరించారు; ప్రాచీన తాళపత్ర గ్రంథాలనుండి, కైఫీయత్తుల నుండి ఎన్నిటినో గ్రహించారు. బ్రౌన్ ప్రతులనుండీ స్వీకరించారు. “హైందవ సారస్వతమునకు గనియనదగు చెన్నపురపు లిఖిత పుస్తక భాండాగారము పెక్కు పద్య రత్న ముల నొసగినది. ...బలు దెఱగుల సమకూడిన పద్యములలోఁ బెక్కింటి నేటి కాలపు మర్యాద నతిక్రమింపకుండ సవరించియు, విడనాడియు, రత్నములనఁ దగినవాని కథా సందర్భములఁ జేర్చి గ్రంథ రూపమున సమకూర్చితిని –” “ఈ మహాశయు [బ్రౌను] డాంధ్రభాషకై యతి ప్రయాసపడి మహోపకృతి సల్పినవాడు. ఇప్పుడు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునను్న సంస్కృ

తాంధ్రగ్రంథములం దనేకము లిమ్మహసీయుఁ డార్జించినవే. ఈతని యాంధ్ర భాషాభిమానమును బుద్ధి వైభవమును దద్భాండాగారముసఁగల గ్రంథములఁబట్టి గుర్తింపనగును'' అనియు వారే తమ చాటుపద్య మణిమంజరిలో పేర్కొన్నారు. ఇలా స్మరించి, ప్రాచీనుల చాటువులను, ఇతరములను పైన పేర్కొన్న విధంగా సేకరించి ఆయా కవుల పేర్లమీదనే కథా సందర్భములను గూర్చి, కొన్నింటిని సవరించియు, విడనాడియు, తగు విధంగా పరిష్కరించి ప్రకటించిన ప్రభాకర శాస్త్రిగారి పరిశ్రమలో చౌర్యంగానీ, దగాగానీ ఏమీలేదు.

బ్రౌన్ సంకలనపరిచినవే కాక ప్రాచీన తాళపత్ర గ్రంథాలలో ఇంకా ఎక్కడెక్కడ ఎన్నెన్ని చాటువుల్ని ప్రాస్తావిక పద్య కావ్య శకలాల్ని ప్రభాకర శాస్త్రిగారు గుర్తించారో (తమ చాటుపద్య మణిమంజరి తరువాతి సంపుటాల్లో ప్రకటించాలనుకొన్నారో) వాటి వివరాలు తెలుసుకోవాలనుకొంటే - మ. ఓ. మే. లైబ్రరీవారు ప్రకటించిన డిస్క్రిప్టివ్ కేటలాగులనైనా కనీసం తిరగవేస్తే తెలియగలదు. వాటినైనా బంగోరే పరిశీలించినట్లు లేదు-అవి తిన్నగా చూచి ఉండినా, ఆ పని ఆద్యంతము ప్రభాకరుల చేతిమీదుగానే సాగినదన్న పరిజ్ఞానముండియుండినా ఆతడీ దౌష్ట్యానికి పాల్పడేవాడు కాదేమో !

'నూరార్లు' పద్యం బ్రౌన్‌దొరను గూర్చినది ప్రఖ్యాతంగా అందరు ఎరిగినదే, వాడేదే; బుచ్చయ్యశాస్త్రిగారి వసుచరిత్ర వ్యాఖ్యానం మొదట్లో వ్రాసిన పద్యాలలో ఇది ఒకటి అని తెలియడం, శ్రీ శాస్త్రిగారు, కలాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారు అచ్చులో దీనిని ప్రకటించిన తర్వాతనే *

---

*1927 లో ప్రకటితమైన మ.ఓ.మే. లైబ్రరీ వారి డిస్క్రిప్టివ్ కేటలాగు 1010 - 1012 పుటల్లో 'నూరార్లు' పద్యంతోపాటు పదకొండు పద్యాలూ ప్రకటింపబడినవి. మహామహోపాధ్యాయ కుప్పుస్వామిశాస్త్రిగారి పేరున ప్రకటింపబడిన ఆ కేటలాగులోని అంశాలను కూర్చి అందించినవారు ప్రభాకరశాస్త్రిగారే. అదీ తెలియ నవసరంలేదు. కనీసం ఈ కేటలాగులను పరిశీలించి వుండినా తెలిసేది తప్పేవరిదో. —సం॥

ఇది సాహితీపరు లందరు ఎరిగినదే; ఈ చిన్న పద్యంలో బ్రౌన్ తెలుగు భాషాభిమానం, వితరణ హృద్యంగా వివరింపబడినందున బాగా వాడుకలోకి వచ్చినది. ఇది తమ సొంతమని వారు చెప్పుకోలేదు. ఇందులో శాస్త్రిగారు చేసిన తప్పులేదు. ఈ పద్యం చాటుపద్య మణిమంజరి మూలంగా నలుగురి నోట పడి ప్రచారం పొందడంలో ఆశ్చర్యమూ లేదు. ఎవరైనా నూతన పరిశోధనలు జరిపి అమూల్యములైన కొత్త విషయాలను ప్రచురిస్తే ఆంధ్ర దేశము హర్షించ గలదు. దివంగతులైన, ప్రఖ్యాతులైన వీరేశలింగం, ప్రభాకరశాస్త్రి వంటి పండితులను అకారణంగా దూషించడం తగని పని. యూనివర్సిటీ అధికారులును పరిశోధన పర్యవేక్షకులును ఇట్టి తగని వ్రాతలను ఉపేక్షించడం వల్ల, ఇట్టి గ్రంథాన్ని ప్రచురించడానికి అనుమతి ఈయడం వల్ల వారి ప్రతిష్టకు లోపము వాటిల్లగలదు.

"గుణరత్నాకరమైన వాని గుణముల్ క్షుద్రుండు దానాత్మలో
బ్రణుతుల్ సేయ నెఱుంగఁ డభ్రతటినీ భాస్వత్పవిత్రైక కం
కణ సంసక్త హిరణ్యవత్కమలినీ కాండోత్కరగ్రాస కా
రణ సంతోషము కొంగ యే మెఱుఁగు శర్వా! పార్వతీవల్లభా!"

[కావ్యశకలం D. 1612]

# A DICTIONARY,

## TELUGU AND ENGLISH

EXPLAINING

## THE COLLOQUIAL STYLE USED IN BUSINESS

AND

## THE POETICAL DIALECT,

WITH

EXPLANATIONS IN ENGLISH AND IN TELUGU.

BY

**CHARLES PHILIP BROWN,**
OF THE MADRAS CIVIL SERVICE,
TELUGU TRANSLATOR TO GOVERNMENT, SENIOR
MEMBER OF THE COLLEGE BOARD, ETC.

MADRAS:
PRINTED AT THE CHRISTIAN KNOWLEDGE
SOCIETY'S PRESS,
CHUCRH STREET, VEPERY.
1852.

---

ఇది శ్రీ ప్రభాకరుల లైబ్రరీలో గల బ్రౌన్ డిక్షనరి ప్రథమ ముద్రణ ప్రతిలోని ముఖపత్రము - మరికొన్ని వివరములు.

# బ్రౌణ్య
# మిశ్రభాషా
# నిఘంటు

# DICTIONARY

## OF MIXED TELUGU.

ALSO AN

## EXPLANATION OF THE TELUGU ALPHABET.



M A D R A S :

PRINTED AT THE CHRISTIAN KNOWLEDGE
SOCIETY'S PRESS,
CHURCH STREET, VEPERY.
1854.

## WORKS PUBLISHED BY MR. BROWN

A Grammar of the Telugu Language First edition, 1840.

English-Telugu Dictionary.

Telugu-English Dictionary.

Dictionary of Mixed Telugu, and the language used in business

Telugu Reader · being a first book in the language : with English Translation, Grammatical Analysis, and Little Lexicon.

English Irregular Verbs explained in Telugu.

Telugu and English Dialogues, with Grammatical Analysis. These have also been printed in Tamil and in Kannadi.

The Vakyavali, or Exercises in Idioms : English and Telugu. This has also been trsnslated into Hindustani.

Wars of the Rajas, in Telugu and English.

Telugu Disputations on village business : with an English translation.

NOTE- The above books are all that the learner requires

The Verses of Vemana : with an English Version. printed in 1829.

Eassay on Telugu Literature.

Zillah Dictionary: a Glossary in the English Character.

The proverbs of Solomon and the Book of Psalms ; in

Sanscrit metre : reprinted in the Telugu character from the Culcutta edition.

Three Treatises on Mirasi Right, by Ellis, Blackburne and Munro.

The Tale of Nala: and the Adventures of Harischandra: in Telugu metre.

The Tales of Nala and of Savitri in Sanscrit : from the Mahabharat.

Cyclic Tables of Hindu and Musulman Chronology.

An Ephemeris, shewing the corresponding dates according to the English, Hindu (Telugu, Tamil, and Malayalam) and Mahomedan Calendars from A.D. 1751 until 1850, with Table of events: and explanatory Preface, 600 pages royal octavo.

Memoirs of Hyder Ali Bahadar, and his son Tippo Sultan, translated from Marata into English.

PREPARING FOR PUBLICATION

A Second edition of the Telugu Grammar.

A Treatise on Hindu rites and ceremonies translated from the French, with emendations.

Telugu Histories and Tales, with a Translation: being a continuation of the Reader.

A Telugu Translation of the Holy Bible.

The Book of Common Prayer, in Telugu.

Shasan' Anusasanicamu; శాసనానుశాసనికము; Chronological Tables, of Indian History : in Telugu.

The Hitopadesa, in Sanscrit, with explanatory notes in Telugu

Popular Telugu Tales.

Various volumes for the School Book Society.

# ఆత్మకథ

## చార్లెస్ ఫిలిప్ బ్రౌన్

*[తెలుగుకోసము నిలువెల్లా ధారవోసినవారిలో బ్రౌను మహాశయుడగ్రగణ్యుడు. తానప్పటి దేశీయగ్రంథసేకరణకుగాను ధనాభావముచే నింటిసామగ్రిసైతము కుదువపెట్టెనని చెప్పుకొందురు. ఇదేగాక తన వేతనములో ముక్కాలుమువ్వీసము దేశీయవిద్యాప్రచారము క్రిందనే వ్యయించేవాడట. ఈలా దేశీయభాషలను, అందులో ప్రత్యేకముగా ఆంధ్రభాషకొఱకింతపాటుపడ్డాడంటే మనము విస్తుపోక తప్పదు. ఇన్నేండ్లు సెలవుగా ఆ మహనీయుని సాహిత్యజీవితము ప్రకటించే భాగ్యా మబ్బినందుకెంతో సంతోషిస్తున్నాము-ఇది ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారి "జాతీయ విజ్ఞానము" పత్రికాధిపతులు కూర్చిన మున్నుడి. శ్రీ ప్రభాకరులు పోయిన కొత్తల్లో శ్రీ కొత్త రామకోటయ్యగారు మా అనుమతితో ఈ బ్రౌన్ జీవిత సంగ్రహానుకృతిని ప్రకటించారు- సం॥]*

నేను 1798 సంవత్సరమున ఇండియాలో జన్మించినాను. మా తండ్రి రెవరెండు డేవిడ్ బ్రౌను. ఆయన ద్వారా హిబ్రూ, సిరియన్, అరబిక్, పర్షియన్, లాటిన్ భాషలు నేర్చుకొన్నాను. తాను 1812 వ సంవత్సరమున గతించెను. ఈ దుఃఖభారముతో మా కుటుంబ మింగ్లండు చేరినది. నేనచ్చటి హెయిలుబరీ కళాశాలలో విద్య నభ్యసించితిని. అప్పటికి నా సోదరు లిరువురు బెంగాల్ సివిల్ సర్వీసులో ఉద్యోగాలు చేస్తుండేవారు.

నేను 1818 లో మద్రాసు చేరినాను. వెంటనే సివిలుసర్వీసులో ఉద్యోగము లభించినది. మొదటినుండి భాషాకండూతిగలవాడను గనుక ఆయా ప్రాంతీయభాషలు చవిచూడగా చూడగా తెలుగుమీద మిక్కిలి మక్కువ యేర్పడ్డది. దాని యానుపానులు తెలిసికోడానికి సరియైన గ్రంథా లొకటి రెండు వినా అట్టే లభించినవిగావు. నిఘంటువన్నది కలికమునకైన లేదు.

ఆనాడు తెలుగులో వ్రేలుపెట్టిన కొంద ఱాంగ్లేయులు సంస్కృతము కంటె, హిందూస్థానీకంటె ఆంధ్రభాష కష్టసాధ్యమని భావించేవారు. ఆ మాట నిజమే. పర్షియనింగ్లీషు భాషలయందువలె చదువుకొలది అన్యదేశీయునకు తెలుగులో నెక్కువ ప్రయాసమే కలుగును. ఎట్లందురా? కొండనెక్కబోవునప్పు డున్న చదును పోబోవనుండునా? తుద కది నిట్టనిటారుగా దేలును. తెలిసినదా? తెలుగంటే యెట్టిదో ఈ యుపమానముతో బోధపడి యుండును. దీని యంతు తేల్చుకొనుటకు ఓర్పు నేర్పు ఉండవలెనని నా యాశయము.

1820 లో మద్రాసు గవర్నరుగా నున్న సర్ థామస్ మన్రో పుణ్యాన కడపజిల్లాకు బదిలీయైతిని. అక్కడ రాజకీయ వ్యవహారమంత తెలుగులో నడపవలసివచ్చినది. తద్వారా తెలుగులో బరిశ్రమ చేయవలసిన యగత్య మేర్పడ్డది. అక్కడనున్న ఒక గుమస్తా సాయముతో దెలుగున నిత్యవ్యవహారము జరుపుకొనువాడనేగాని దానియందంత పట్టుదల చూపినవాడనుగాను.

అసలీ పరిశ్రమకంత మూలకందము సర్ థామస్ మన్రోగారి యుప న్యాసము. వా రొకమారు కాలేజీలో నుపన్యసిస్తూ దేశభాష లత్యావసర పఠనీయ ములని నొక్కి చెప్పినారు. దీనికి కొందఱాంగ్లేయులు విముఖులుగా లేకపోలేదు గాని నాకావిషయ మత్యంత ప్రాముఖ్యముగా దోచినది.

1822 లో మచిలీపట్నమున కసిస్టెంటుజడ్జిగా నియమితుడనైనాను. అదీ తెలుగుప్రదేశ మవడముచేత నా పరిశ్రమకు మిక్కిలి అనుకూలించినది కాని అక్కడా సామెతక్రిందికే దిగినది. నాకుతో డాజడ్జికూడ భాషోన్మాది. అందుచే నతని యభిరుచి కనుగుణనుగా లాటిను చదువుచుండేవాడను.

కొన్నాళ్ళకు న్యూటెస్టుమెంటుకు తెలుగు సేత గావలసివచ్చినది. అప్పటి కయిన తర్జుమాలు నాకాట్టే రుచించినవి గావు. దానితో జిజ్ఞాస ప్రారంభమైనది.

1824 లో మాత్రం తెలుగు పుస్తకములమీదికి ధ్యాస మరలినది. దానితో నేదేండ్లెడతెగకుండ జదివితిని.

మరొక విషయము. నాటి బోధకుల తీరు లయోమయములుగా నుండెడివి. అందుచే బెదరుపెట్టి మున్మా రీచదువునకు స్వస్తి చెప్పితిని. వారి యుపదేశ మాలాటిది. వారి హస్త వ్యస్తముల గురించి నేనేమైన నంటినా యెగిరి ముక్కు మూసుకొనేవారు

అప్పటికి నలుబదేండ్ల చదవరిని. వారి గానట బీసటకు దోడు ఓర్పు లేకున్న నాపడు ప్రయాస మంతయు గంగ గలిసెడిదే? కాక వారి బోధన పద్ధతుల లోటా? 'లేరుంటే నేనే బండరాముణ్ణా' అని సందేహిస్తుండేవాడను.

ఆ పండితులకు ఇంగ్లీషు బొత్తుగా రాదు. వారు తెలుగుననో, సంస్కృతముననో, హిందూస్థానీలోనో బోధ చేసేవారు. నాకు మాత్రమీపట్ల కాంబేలు-విల్సను నిఘంటువు లెంతే నుపకరించినవి.

వ్యాకరణనిఘంటువుల సాపేక్షలేని చదువులు కొరముట్లులేని పనితనము వంటివి.

అనాడు నాకడ సరియగు తెలుగు పొత్తములేదు. "అబ్బేదుబా" రచించిన హిందువుల చరిత్రమాత్రము వేమన్నను పరిచయము చేసినది. అతని రచనలు దాదాపు నాలుగువేల పద్యాలు లభించినవి. తద్వారా నా యధ్యయనము అనువాదము సాగినది.

1826 లో రిచర్డు క్లార్కు కోర్కెమీద తెలుగు ఛందోవివరణ, సంస్కృత చ్ఛందఃపద్ధతిని వివరించితిని. 1828 లో వానిని, వేమన పద్యాలను (ఇంగ్లీషు తర్జుమాతో) ముద్రించితిని.

1825 లో ఆంధ్రభారతము చదువునపుడు వ్యావహారికముగా శబ్దార్థములు బోధించు గురువులకు నాకును భిన్నాభిప్రాయము లేర్పడ్డవి. శబ్దవిచారమూకాయ పోకాయగా చేయరాదని నా తాత్పర్యము. అతనిదంత నాటుధోరణి. అయిన నోపికపట్టి శబ్దవివరణము పద్యసంఖ్య నేర్పఱిచితిని.

ఇక లిఖితగ్రంథముల సేకరణకు గడగితిని. ఆ కాలమువా రాయా గ్రంథములీకున్నను మంచితనముమీదమటుకు వానిని రాబట్టగలిగితిని.

నాడు తప్పులు తడకలుగానున్న తెలుగు వ్రాతప్రతుల బెక్కు తెప్పించి వానినెల్ల నిర్దుష్టముగా సవరింపించితిని.

ఆ కాలమున పొట్టగడవని పండితుల రావించి స్వల్పవేతనములతో బెక్కు ప్రతుల దయారుచేయించితిని. స్థలాంతరోదాహరణముల కనుకూలముగా బద్య సంఖ్యయు నిప్పించితిని.

కొన్ని కావ్యములలోని క్లిష్టపద్యములకు వ్యాఖ్యానము గూడ చేయించితిని.

సంస్కృత కావ్యాలకు మట్టుకు తఱుచు వ్యాఖ్యలుండేవి. వానిని తత్సాహాయ్యమున జదివేవారము. దెలుగులో మాత్ర మొకటి రెండు కావ్యాలకే వ్యాఖ్యలు గనిపించినవి. ఆ టిప్పణులుఁగూడ వారిపాండిత్య ద్యోతకాలయి పాషాణ పాకాలుగా ఉండేవి. అందుచే బాలకులకు అంతగా ఉపయోగపడేవి గావు. అందుకని ఆయా కావ్యాలకు సులభశైలిలో వ్యాఖ్య వ్రాయడానికి కొందఱు పండితుల నియమించితిని. క్రమేణ ప్రసిద్ధాంధ్ర కావ్యాలన్నిటికి టిప్పణు లేర్పడ్డవి.

కచేరీలోను, కోర్టులోను మాట్లాడే వాది, సాక్షి, ఖైది, ఆఖరికి బంట్రోతు గూడ నాకీ తెలుగు నుడికారములో గురువు లైనారంటే నమ్మండి.

ఆ కాలములో గ్రంథాలయ మేర్పాటు చేయవలయునను కుతూహల మేర్పడ్డది. దానికొఱ కెంతో సొమ్ము వ్యయించినాను. నా కడ దాదాపు ఇరువది మంది వ్రాయసగాండ్రుండేవారు. వారందఱు మాతృకలకు ప్రతికలు తయారు చేస్తూనో, పట్టికలు కూరుస్తూనో, వ్యాఖ్యానాలు వ్రాస్తూనో ఉండేవారు.

1832 లో మసులాలో ఒక ప్రెస్సు పెట్టవలెననుకొన్నాను. దానికని చేరదీసిన ఆంగ్లేయుని మూలాన అది భగ్నమైపోయినది.

జాన్‌సన్ ఇంగ్లీషు నిఘంటువు తెలుగులోనికి మార్చవలెననే ప్రయత్నము 1832 నకు గాని నెరవేరినదిగాదు.

వీనితోపాటు సంస్కృతాధ్యయన మేమరేవాడనుగాను. నాకపుడు నచ్చిన సంస్కృత గ్రంథాలలోని లలితోపాఖ్యానమును (22 అధ్యాయములు) లాటిను భాషలోని కనువదించినాను

1834 లో మూడేండ్ల సెలవుమీద ఇంగ్లండు వెళ్ళవలసివచ్చినది. అచ్చట నచ్చటముచ్చటగా కాలముగడుపుచు తీరిక చిక్కినప్పుడెల్ల నిఘంటువు నకు ప్రతియొకటి వ్యాకరణమొకటి పూర్తి చేసినాను. రూసెన్‌గారి కోర్కె చొప్పున సంస్కృత చ్ఛందస్సును గూర్చి చిన్న పుస్తకమొకటి వ్రాసినాను.

ఇండియాహౌసులోని తెలుగు, కన్నడ వ్రాతప్రతులకు క్యాట్లాగు తయారు చేసి దానిని మద్రాసు కంపేటట్లు చేసినాను.

నే ననువదించిన సెయింట్ లూకును ఒక జంగముకవిద్వారా పద్య కావ్యముగ మార్పించితిని. అది 1854 లో అచ్చయినది.

ఓఢ్రదేశీయుడైన బ్రాహ్మణబాలుడొకడు యాచనకురాగా సతనిని ప్రోత్స హించి కొన్ని రీడర్లను ఓఢ్రములోనికనువాదము చేయించినాను. అవి 1851 లో అచ్చయినవి.

1853 లో ఆరోగ్యార్థ ముదక మండలమున కేగితిని. అక్కడ బెరన్‌హార్డు స్మిత్‌తో పరిచయము గలిగినది. అతడంతకు పూర్వ మచ్చొత్తించిన తమిళ గ్రంథాలను మరల ముద్రింతుననగా దేశిభాషల మీద మమకారముచే నా పుస్తక ముద్రణకు వలయు ద్రవ్యమంతయు నిచ్చితిని.

దేశీయులు తెలుగు, హిందీ నేర్చుకొనుటకుగా కొన్ని ఉచిత పాఠశాల లేర్పరిచితిని. అవి కొంతకాలము పనిచేసి కమిటీ లోపముచే నాగిపోయినవి.

కర్నలు మెకంజీ సేకరించిన తెలుగు కన్నడి సంపుటాల యానుపానులు తెలుపుటకు పండితుల సాయము గోరినాను. ఆ పదజాల మర్థముగాక తేదీలు తేలక వారు తికమక పడినారు. తుదకు నేనే కొంత గుర్తుతో ఆ మహారణ్యాన్ని ఛేదించి చారిత్రక కాలనిర్ణయ పట్టిక నేర్పరిచినాను.

1851 లో లండన్ నగరములో జరిపిన భాషానువాదాల ప్రదర్శనకుగా తెలుగు కన్నడ గద్యపద్యాలను అనువాదాలు చేయించి స్వయముగా ముద్రించి పంపించితిని.

స్క్రిప్చరును (బైబిలు) తెలుగు చేయడములో ముద్రితాలైన సంస్కృత, తమిళ, బెంగాలి, మరాటి, కన్నడానువాదాలు నాకు బాగా తోడ్పడినవి.

అసలు బైబిలును ఇతర భాషలలోనికి మార్చడమంటే చెత్తచెదారము లేకుండ ఇటుకలు తయారుచేయుట వంటిది. ఎంత గాలించిన ముఖ్యమైన మాట లకు తూకమైన పదాలాట్టే తెలుగులో మాత్రము దొరకనేరవు.

1844 లో తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు నచ్చువేయడానికి మద్రాసు క్రైస్తవ సమాజము పూనుకొన్నది. ఆ నిఘంటువులో దాదాపు రెండు వందలకు పైగా తెలుగు రచయితలు పేర్కొనబడినారు.

నేనచ్చొత్తించిన పుస్తకాల జాబితా యిది:

1. తెలుగుభాషా వ్యాకరణము - 1840 లో ముద్రితము. 1857 లో విశేషాంశములతో పునర్ముద్రితము.

2. ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు. 1400 పుటలు.

3. తెలుగు- ఇంగ్లీషు నిఘంటువు. 1300 పుటలు.

4. మిశ్రాంధ్ర నిఘంటువు. వర్తక సరళి కనువైనది. 130 పుటలు.

5. జిల్లా నిఘంటువు. ఇంగ్లీషులో ముద్రితము. 130 పుటలు,

6. తెలుగు - ఇంగ్లీషు సంభాషణలు. వ్యాకరణ వివరణములతో సహా. ఇది అరవము, కన్నడములో గూడ ముద్రితము.

7. తెలుగు రీడరు. ఉత్తరములు, కథ లిత్యాదులు.

8. ఇంగ్లీషుని పాతక్రియలు, తెలుగున, తమిళమున గూడ వివరింపబడినవి.

9. వాక్యావళి. ఇంగ్లీషు జాతీయాఖ్యానములు కలది.

10. వాక్యావళి. (2) దక్షిణ హిందూస్థానీ అనువాదము.

11. తెలుగు వివాదములు. మిరాసీ గ్రామ వ్యవహారములకు సంబంధించినది.

12. రాజుల యుద్ధములు. 1750 ప్రాంతమున బళ్ళారి జిల్లాలో జరిగినవి. ఆంగ్లానువాదముతోసహా.

13. తాతాచారి కథలు. ఇది కథల సంపుటి. దీనిలో హైదరు చరిత్ర గూడ కొంత కలదు.

14. వేమన పద్యములు. ఆంగ్లానువాదముతో 1829 లో ముద్రితము.

15. తెలుగు సంస్కృతచ్ఛందో వివరణ. 1827 లో ముద్రితము.

16. సంస్కృతచ్ఛందో వివృతి. 1837 లో ఆంగ్లాక్షరములతో ముద్రితము.

17. హిందూ ముసల్మాన్ (క్రానాలజి) కాలనిర్ణయ ఫలకము. 1850 లో ముద్రితము. 1863 లో పునర్ముద్రితము.

18. ఎఫిమెరీస్ (పంచాంగము). 1751 మొ॥ 1851 వరకుగల ఇంగ్లీషు, మహమ్మదీయ పంచాంగముల ననుసరించి ఒండొంటికి సరిపోవు తేదీల పట్టిక. అప్పటప్పటి వృత్తాంత కాలక్రమ పట్టికతో కూడా. 600 పుటలు. దీనిని అన్ని ఆఫీసులలో నిరంతర ముపయోగించుకొంటున్నారు.

19. హైదరాలీ టిప్పుసుల్తానుల చరిత్ర. మహారాష్ట్రము నుండి ఆంగ్లానువాదము.

20. ఆంధ్ర సారస్వత వ్యాసములు. రెండు భాగములు.

ఇక విద్యాసంస్థల కోసము తెలుగున కనుపదింపబడిన గ్రంథజాలము గాక—

మహాభారతము, భాగవతము, భాస్కర రామాయణము, ఉత్తర రామాయణము, మనుచరిత్ర వసుచరిత్రములు (సవ్యాఖ్యానములు) పెక్కు వెలువరించితిని.

ఇంక నిరువది అచ్చుగాని వున్నవి.

ఈలా నేను ప్రకటించిన గ్రంథాలేగాక సేకరించిన సంస్కృతాంధ్ర లిఖిత గ్రంథ సంపుటాలతో పెద్ద లైబ్రరీ తయారయినది. ఈ భాగ్యమంత 1845 లో మద్రాసు లిటరరీ సొసైటీ కప్పగించినాను. ఇందులకుగాను నాకు ముప్పదివేల రూపాయలకు పైగా వ్యయమయినవి.

నేను లండను యూనివర్సిటిలో తెలుగు ప్రొఫెసరుగా నున్నప్పుడును ఈ భాషాసేవ నేమరలేదు. అచ్చట కొందరు విద్యార్థులకు సంస్కృతాంధ్రములు గఱపేవాడను. హిందూ మహమ్మదీయ సమస్యల గురించి ఉపన్యసిస్తుండే వాడను. తీరిక సమయములలోమాత్ర మీతాలూకు గ్రంథావలోడన చేస్తూనే ఉండేవాడను.

నా యీ ప్రకటిత గ్రంథాలన్నీ ముఖ్యముగా ఉపయోగించుకోవలసిన వారు దేశీయులు. అందులో తెలుగువారి కావశ్యకాలైన వేవేవో ముఖ్యముగా ఏర్చికూర్చినాను. అసలు హిందువులకు మేలు చేయడమే నా ప్రధానాశయము.

శ్రీ కొత్త రామకోటయ్య

(బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సేకరణ కనుకరణ)

[జాతీయ విజ్ఞానమువారి సౌజన్యముతో]

# సి. పి. బ్రౌన్ (1798–1884) వర్ధంతి

—ఆరుద్ర

*[ బ్రౌన్ దొర జన్మించి నేటికి నూట ఎనభై ఆరేండ్లయింది. గతించి యీ యేటికి నూరేండ్లు నిండుతవి. ఈయన శతవర్ధంతిని పురస్కరించుకొని గత సంవత్సరం (11-12-1983) ఆంధ్రజ్యోతిలో వ్రాసిన ఆరుద్రగారి వ్యాసాన్ని ఇక్కడ పునర్ముద్రిస్తున్నాము. చమురుపోసి వత్తి ఎగసనదోసి మన యింట దీపం పెట్టింది బ్రౌన్ దొర అయితే దాన్ని చేయెత్తి నిల్పి తొల్త దర్శింపజేసినవారు ప్రభాకరులే! అయినా అందరినీ పేర్కొన్న ఆరుద్రగారి వ్యాసంలో ప్రభాకరులను స్మరించలేదెందుకో.- సం॥ ]*

ఎవరి కోడీ కుంపటీ లేకపోయినా తెల్లవారక తప్పదు. అయితే, కన్ను పొడుచుకొన్నా తెన్ను తెలియని గాఢాంధకారంలో ఎవరైనా దీపం పెట్టందే, వత్తి ఎగసన తోయందే, చమురుపోయందే వెలుగు వుండదు. ఇవాళ తెలుగు భాషా సాహిత్యాలు ఇంత వెలుగు వెలుగుతూ వుండడానికి కారణభూతుడు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొర. కొడిగట్టి పోతువ్న తెలుగు సాహిత్యానికి స్నేహదానం చేసిన ఆ చిరస్మరణీయుని వర్ధంతి డిసెంబరు 12 వ తేదీనాడు తెలుగు సాహిత్యాభిమానులంతా జరుపుకోవాలి.

## పుట్టు పూర్వోత్తరాలు

రేపటికి సరిగ్గా తొంభై తొమ్మిది సంవత్సరాల క్రిందట ఆయన లండన్‌లో తన ఎనభై ఆరోఏట కీర్తిశేషుడయ్యాడు. ఆయన లండన్‌లో మరణించినా, పుట్టింది మాత్రం మన దేశంలోనే. 1798 నవంబరు ఏడో తేదీనాడు కలకత్తాలో జన్మించాడు. అతని తండ్రి రివరెండ్ డేవిడ్ బ్రౌను, మత ప్రచారకుడే కాక విద్యావేత్త. తండ్రిగారి తరిఫీదులో ఇంగ్లీషుతోబాటు హీబ్రూ, సిరియన్ భాషలూ ఆరబిక్, పెర్షియన్, హిందూస్థానీ భాషలు చిన్నప్పుడే ఛార్లెస్ నేర్చుకున్నాడు.
రిశోధనా పద్ధతులలో శిక్షణ పొందాడు.

రివరెండ్ బ్రౌన్ 1812 లో ఛార్లెస్ పద్నాలుగో ఏట మరణించాడు. అతని ముగ్గురు కొడుకులూ, కుమార్తెలు ఇంగ్లండుకు వెళ్ళిపోయారు. ముగ్గురు అన్నదమ్ములూ తూర్పు ఇండియా కుంఫిణీవారి కొలువులో చేరి ఇంగ్లండ్‌లోని హెయిల్‌బరీ కాలేజిలో శిక్షణ పొందారు. ఛార్లెస్‌ని మద్రాస్ సిబ్బందిలోనూ, అతని అన్నదమ్ములను కలకత్తా సర్వీసులోనూ నియమించారు. ఛార్లెస్ తన పందొమ్మిదోయేట 1817 లో మద్రాసుకు చేరుకున్నాడు. కుంఫిణీవారి కాలేజీలో చదువుకొన్నాడు 1821 లో కడపలో కలెక్టర్‌గారి 'అశిస్టాంట్'గా నియమితుడయ్యాడు. 1824 లో తన ఇరవై ఆరో ఏట మొట్టమొదటిసారిగా వేమన పద్యాల గురించి చదివాడు. వాటిని సేకరించడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం తెలుగు సాహిత్య గంగావతరణానికి భగీరథ ప్రయత్నమై ఫలప్రదమైంది.

## వేమన ప్రభావం

అప్పటిదాకా అందరికీ అందుబాటులో లేకుండా ఆకాశ గంగలావున్న ఆంధ్రసాహిత్యాన్ని భూమార్గం పట్టించి ఉత్తరోత్తరా ఎందరెందరో సాహితీ కృషీవలుల పంట పొలాలకు నిత్యజలాలు అందచేసిన ఘనత బ్రౌన్ దొరదే. ఆయనలో తెలుగు సాహిత్య పిపాసను రేకెత్తించిన ప్రభావ కవిత వేమనగారిదే.

వేమన పద్యాలను సేకరించడానికి పూనుకొన్న బ్రౌన్ దొర ఎక్కడెక్కడ వున్న తాళపత్ర ప్రతులను తెప్పించాడు. వాటిని కాగితాలమీదకు ఎక్కింపచేశాడు. పాఠ నిర్ణయానికి ప్రారంభించాడు. పద్యక్రమాలను పరిష్కరించాలంటే ఛందోనియమాలూ, వ్యాకరణ సూత్రాలూ తెలియాలి.

అందుకోసం బ్రౌన్ ఆంధ్ర గీర్వాణఛందస్సులు అభ్యసించాడు. వాటి మీద ఒక పుస్తకమే రాశాడు. తెలుగు వ్యాకరణాన్ని కరతలామలకం చేసుకున్నాడు. ఇంగ్లీషులో ఒక మంచి తెలుగు వ్యాకరణాన్ని తరువాత రచించాడు. వేమన పద్యాలలో మాటలకు అర్థనిర్ణయం చేయాలంటే నిఘంటువుల సహాయం కావాలి. అప్పటికున్న నిఘంటువులు తనకు ఉపయోగపడడంలేదని తానే ఒక నిఘంటువు నిర్మాణానికి పూనుకొన్నాడు. మన భాషలో వచ్చిన ప్రథమ

ప్రామాణిక నిఘంటువు బ్రౌణ్యమే (తన నిఘంటువుకు బ్రౌణ్యమనే పేరు అతనే పెట్టుకొన్నాడు. ఛాందసాంధ్ర పండితులు పెట్టలేదు.)

పూర్వకవి ప్రయోగాలను ప్రమాణంగా చూపెడుతూ ఏ భాషా నిఘంటువు నైనా నిర్మించాలంటే ఆ భాషలోని ప్రామాణిక గ్రంథాలన్నీ సేకరించాలి. బ్రౌను కాలం నాటి ప్రముఖ ప్రాచీన కవుల గ్రంథాలైనా అన్నీ ఒకచోట ఎవరూ సేకరించి పెట్టలేదు. ఆ పనికి బ్రౌన్ దొరే పూనుకొన్నాడు. ఒకటి కాదు, రెండు కాదు, అయిదు వందల యాభై మూడు సంపుటాలలో ఒక వెయ్యీ తొంభై తెలుగు కావ్యాలూ, పురాణాలూ చిట్టచివరకు సేకరించగలిగాడు. ప్రతి ప్రముఖ కావ్యానికి పదసూచికలు తయారు చేయించాడు. ముఖ్యమైన కావ్యాలకు వ్యాఖ్యా నాలు రాయించాడు. 1841 నుంచి అచ్చుపడుతూ వస్తున్న తెలుగు కావ్యాలలో ఎన్నిటికో బ్రౌన్ దొర తయారు చేయించిన ప్రతులే మాతృకలు.

కావ్యభాషకు మాత్రమే నిఘంటువు రచిస్తే అది పరిమిత ప్రయోజనాలకే ఉపయోగపడుతుంది. జనులు నిత్య వ్యవహారంలో వాడుకొనే మాటలనూ, ఉత్తర ప్రత్యుత్తరాల రాసుకునే మాటలుకూడా నిఘంటుకర్త పరిశీలించి స్వీక రించాలి. అందుకే బ్రౌన్ దొర అన్ని తరగతుల ప్రజలూ తమలో తాము రాసు కొన్న లేఖలనూ, అధికారులకు పెట్టుకొన్న అర్జీలనూ శతాధికంగా సేకరించాడు. కథలూ, వార్తాపత్రికల కథనాలూ మొదలైనవి ప్రోగుచేశాడు. ఇవన్నీ 1591- అక్షరాలా పదిహేను వందల తొంబై ఒకటి పత్రాలు. వీటిని 17 సంవత్సరాలలో కాపీ చేయించాడు. (మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఇవి వున్నాయి. M 401, M 411, M 417 నుంచి M 431 దాకా వీటి కాల్ నెంబర్లు)

## సాహితీ నిధి నిక్షేపాలు

ఏ సాహితీపరునికైనా వెనుకటి తరాలలోవారు సంపాదించి పెట్టిన నిధి నిక్షేపాలు ఎంతగానో ఉపయోగపడతాయి వాటి విలువను గుర్తించి వాడుకో వలసిన పద్ధతిలో వాడుకుంటే అవి తరగని గనులు. లోగడ కర్నల్ కాలిన్ మెకన్‌జీ దొరగారు సేకరించిన శాసనాలు, సంపాదించిన కావ్యాలూ, వ్రాయిం చిన కైఫీయత్తులూ, వేయించిన చిత్రాలూ మొదలైనవాటి విలువ బ్రౌన్ దొర

సరిగ్గా కట్టగలిగాడు అవిపరకే చాలా కైఫీయత్తులను లోకల్ రికార్డ్సు అనే పేరుతో కాపీచేయించి భద్రపరచాడు. ఎంత సహజ సంపద వున్నా, అన్ని విషయాలలోనూ ఆంధ్రులం దౌర్భాగ్యులమే. మెకన్‌జీ, బ్రౌన్ వంటి ఉదారులు మన స్థానిక చరిత్రల గురించి ఇంతటి ముడిసరుకును పోగుచేసిపోతే ఒకటిన్నర శతాబ్దాల నుంచి వాటిని అలాగే ఆట్టే పెట్టేసుకుంటున్నాం. వీటన్నింటినీ అచ్చు వేయించి పరిశోధకులకు అందుబాటులో వుంచాలనే జ్ఞానం మనకు లేదు, మన ప్రియారిటీస్ వేరు.

1824 లో తన ఇరవయ్యారోయేట గ్రంథ సేకరణకు పూనుకొన్న బ్రౌన్ దొర 1836 లో తాను సంపాదించిన తాళపత్ర గ్రంథాలను, వాటికి కాగితం మీద వ్రాయించిన ప్రతికలూ చెప్పించిన వ్యాఖ్యానాలూ, చేయించిన టీకలు, రాయించిన పదసూచికలూ అన్నీ కలుపుకొని ఏమాత్రం ఖరీదు చేస్తాయని ఒక అంచనా కట్టాడు. ఆ ఏడాది నాటికి ఈ పన్నెండేళ్ళలో 30,000 రూపాయలు వాటిమీద ఖర్చు పెట్టినట్టు ఉజ్జాయింపుగా తేలింది. ఆయన నెలజీతం మీద పండితులను కొలువులో పెట్టుకొని ఈ సాహిత్య సేవను చేయించాడు. అతని బంగళాను "బ్రౌనుదొరవారి కాలేజీ" అని పిలిచేవారు. నిజంగా అది కళాశాలే.

1845 లో తన నలభై యేడో యేట బ్రౌన్ దొర తన ప్రాచ్య గ్రంథాలయాన్ని కుంఫిణి సర్కారు వారికి బహూకరించాడు. మద్రాసు లిటరరీ సొసైటీవారికి దానిని స్వాధీనంచేశారు. 1,615 తాళపత్ర సంపుటాలూ. 836 బైండు చేసిన కాగితం సంపుటాలూ గల ఈ సంస్కృతాంధ్ర గ్రంథాలయాన్ని సంరక్షించడానికి తాను నియమించిన వంగ్గురు నేటివులను అదే ఉద్యోగంలో వుంచమని సిఫార్సు చేశాడు వాళ్ళకి నెలసరి ఇవ్వవలసిన జీతాల పరిమితి ఎంతెంతో చెప్పాడు.

## ఉద్యోగ విరమణ

1854 లో తన యాభై ఆరోయేట బ్రౌను దొర ఉద్యోగం నుంచి విరమించాడు. సాలుసరి 420 పౌండ్ల ఫింఛను మీద సీమకు వెళ్ళిపోయాడు. ముప్పయి ఎనిమిది సంవత్సరాలు మన దేశంలో, మన ప్రాంతాలలో పనిచేసి కష్టపడి తాను సేకరించిన గ్రంథాలు మన దేశంలోనే విడిచివెళ్ళిపోయాడు.

లండన్‌లో మరో ముప్పయి సంవత్సరాలు జీవించాడు. ఈ మూడు దశాబ్దాలూ తెలుగు భాషా సాహిత్యాల సేవకే వినియోగించాడు. తన నిఘంటువులను తిరగ రాశాడు. వ్యాకరణాన్ని పెంపు చేశాడు, ఇండియాలో ఇంత గ్రంథ సంచయాన్ని విడిచిపెట్టి వెళ్ళినా, మళ్ళా ఇంగ్లండులో కూడా బహుళ గ్రంథ సంచయాన్ని సేకరించాడు.

తన ఎనభై ఆరోయేట తన మరణ శాసనాన్ని రాస్తూ, అందులో తన ప్రాచ్యలిఖిత, ముద్రిత గ్రంథాలన్నింటినీ ఇండియా ఆఫీసు లైబ్రరీకి దానం చేశాడు. తాను ఇచ్చిన గ్రంథాలను స్వాధీనపరచుకోడానికి అయ్యే ఖర్చుల మింజుమలె ఒక పది పౌండ్లను కూడా దానం చేశాడు. తన విల్లును అమలుజరపవలసిన వాళ్ళలో ఒకడైన రివరెండ్ జార్జి బ్రౌన్‌కు తన గ్రంథాలయంలో అతనికి నచ్చిన నూరు సంపుటాలను దానం చేశాడు. ఈ రివరెండ్ బ్రౌన్ మరెవరో కాదు, మన ఛార్లెస్ బ్రౌనుకు స్వయానా తోడబుట్టిన వాడి కొడుకు. ఇతడు అన్న కొడుకో, తమ్ముని కొడుకో భావి పరిశోధనవల్ల తేలుతుంది గానీ, ఈయన ఏ గ్రంథాలు ఎంచుకొన్నాడో, అవి ఇప్పుడు ఎక్కడ వున్నామో తెలియదు. ప్రయత్నిస్తే తెలుసుకోవచ్చు.

## ఒక ప్రశ్న

మన భాషా సాహిత్యాల కోసం ఇంతటి మహత్తర కృషిని చేసిన బ్రౌన్ దొర జ్ఞాపకార్థం మనం ఏమేమి చేశా మన్నది వేసుకోవలసిన ప్రశ్న. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 1963 లో డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగారి చేత సి.పి. బ్రౌన్ (1798-1884) అనే జీవిత చరిత్రను రాయించారు దీనిని వీరభద్రరావుగారు అమెరికాలో విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో వుంటున్నప్పుడు రచించారు. చాలా ముద్రిత గ్రంథాలను సంప్రదించారుగానీ, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో వున్న వ్రాతప్రతుల సంపుటాలను చూడలేకపోయారు. అందుకే ప్రయత్నం ఎంత ప్రాథమికమో ఫలితం కూడా అంత ప్రాథమికంగానే పరిణమించింది.

అయితే, ఈ గ్రంథంలో డాక్టర్ వీరభద్రరావుగారు రాసిన ''తెలుగు ప్రజలు- బ్రౌనుదొర'' అనే అధ్యాయం చాలా చక్కని ప్రణాళికతో రాశారు.

బ్రౌనుదొర లేఖల సంపుటాలను వీరభద్రరావుగారు చూసివుంటే చెప్పుకోదగ్గ గ్రంథమే ఈ శీర్షికతో వ్రాయగలిగి వుండేవారు.

తెలుగుభాషా సమితివారు తయారు చేయించిన విజ్ఞాన సర్వస్వం మూడవ సంపుటిలోని అక్షరాది సూచిలో బ్రౌన్ పేరేలేదు. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశంలో కూడా బ్రౌన్ జీవిత చరిత్ర ప్రత్యేకంగా లేదు. భాషా సమితి పునఃసంశోధిత ప్రతిలో అయినా సార్లు బ్రౌన్ పేరు అకారాది సూచికలో కనబడుతుంది.

కొన్ని విశ్వవిద్యాలయాలలో పిహెచ్. డి. పట్టం కోసం కొందరు సిద్ధాంత వ్యాసాలు రాస్తున్నారు, రాశారు. చల్లా రాధాకృష్ణశర్మగారు బ్రౌన్ సాహిత్య సేవపై ఒక చిన్న పుస్తకం రచించారు.

## ఎస్. వి. యూనివర్శిటీలో...

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు మాత్రం చెప్పుకోదగ్గ కార్యక్రమాన్ని చేపట్టారు. సి. పి. బ్రౌన్ రిసెర్చి ప్రాజెక్టు అనే పథకాన్ని రూపొందించి, ఈ విశ్వవిద్యాలయం తెలుగుశాఖ బ్రౌన్ గ్రంథాలను నాలుగింటిని ప్రకటించింది. లండన్‌లోని ఇండియా ఆఫీసు గ్రంథాలయంలో వున్న బ్రౌనుకు సంబంధించిన పత్రాలనూ, పుస్తకాలనూ మైక్రో ఫిలింమీద ఎక్కించి తెప్పించింది. ఇవి ఇరవై వేల పుటలలో వున్న ఆకిరాల గనులు, ఈ భోగట్టాలన్నింటిని ఓపికతో పరిశీలించి బ్రౌన్ సమగ్ర సాహిత్యసేవను అంచనా వేయకుండానే ఈ ప్రాజెక్ట్ నిలిచిపోవడం దురదృష్టకరం. ప్రాజెక్ట్ ఆగిపోయినా, బ్రౌన్‌పట్ల శ్రద్ధ మాత్రం తగ్గలేదు. ఆచార్య జి యన్. రెడ్డిగారు ఈ సంవత్సరం ఆగస్టులో ఇంగ్లండ్‌కు వెళ్ళినప్పుడు బ్రౌన్ గురించి కొత్త భోగట్టాలకోసం ప్రయత్నించడం నాకు తెలుసు.

నేను లండన్‌లో ఇండియా ఆఫీసు గ్రంథాలయంలో దొరికిన బ్రౌన్ సంపుటాలన్నింటినీ ఓపికగా పరిశీలించాను. ఇవన్నీ తిరుపతిలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు తెప్పించినవే అని నాకు బాగా తెలిసినా, స్వయంగా నాకళ్ళతో నేను ఒరిజినల్స్ చూస్తేగాని తృప్తి వుండదని పరిశోధించాను. ఎన్నో నోట్సు తీసుకున్నాను. అయితే చేయవలసిన పరిశోధనలన్నీ కాలాభావంచేత

చేయలేకపోయాను. కాలికి బలపం కట్టుకొని లండన్‌లో చాలాచోట్లకు వెళితే, బ్రౌన్ గురించి ఎన్నో విషయాలు సేకరించవచ్చు. చిరునామాలు దగ్గరుండి కూడా వ్యవధి లేక బ్రౌన్‌కు సంబంధించినవాళ్ళ సంతతి వాళ్ళను ఇంటర్‌వ్యూ చేయలేకపోయాను. నా బ్రిటన్ పర్యటన కేవలం పరిశోధనలకే పరిమితమై వుంటే బ్రౌన్ ఫొటోకోసం ప్రయత్నించేవాడిని. అది దొరుకుతుందన్న నమ్మకం నాకు వుంది.

## బంగోరె పరిశోధనలు

బ్రౌన్ గురించి చెప్పుకొనేటప్పుడు బంగోరె గురించి చెప్పుకొనక తప్పదు. అతనికి బ్రౌన్ పిచ్చి నావల్లనే సంక్రమించింది. ''బ్రౌన్ జాబులు- తెలుగు జర్నలిజం చరిత్ర'' చిన్న సంకలనాన్ని నాకు కూడా అంకితమిస్తూ ''బ్రౌన్ గురించి పరిశోధించవలసిన సోర్సెస్ చాలా వున్నాయంటూ తనకు తెలియకుండానే నన్ను ఈ కృషికి పురిగొల్పిన'' వాడుగా నన్ను పేర్కొన్నాడు. ఇది 1978 లో జరిగింది. బంగోరే దీక్షగా పరిశోధనలు చేసినా దక్షత లోపించడంవల్లా, నిగ్రహం కోల్పోయినందువల్లా ప్రాజెక్టును పూర్తిచేయలేక పోయాడు. అయితే, రాకాసి పట్టుదలతో మౌలికమైన పరిశోధనలు చేసి బ్రౌన్ 'సాహిత్య స్వీయచరిత్ర'ను ఎడిట్ చేసినందుకు అతణ్ణి ఎంతగా మెచ్చుకోవాలో అతని అకాల బలవన్మరణానికి అంత బాధపడాలి. బ్రౌన్ విషయంలో అతడు చేసినవీ, చేయనివీ, చేయకూడనివీ, చేయవలసినవీ ఎన్నో అతనికే చాలాసార్లు చెప్పాను. అంతటి దీక్షతో పరిశోధనలు చేసేవాళ్ళు ఇప్పుడూ, ఎప్పుడూ మనకి కావాలి.

ఇంకొక్క ఏడాదిలో మనం బ్రౌన్ శత వర్థంతి జరపాలి 1984 డిసెంబరు 12వ తేదీ నాడు సాహిత్య అకాడమీ ఏ విధంగా ఈ సంస్మరణోత్సవాన్ని చేస్తుందో తెలియదు నా మట్టుకు నేను బ్రౌన్ శత వర్థంతి నాటికి నా సమగ్ర ఆంధ్ర సాహిత్యం కుంఫిణీయుగాన్ని పూర్తి చేసి ప్రకటించదలచుకున్నాను. ఒక్క బ్రౌన్ మీదనే కాక అతని సంచికల గురించీ విపులంగా రాయబోతున్నాను. బ్రౌన్ కట్టించిన సాహిత్య సౌధానికి రాళ్ళెత్తిన కూలీల గురించి రాయడం కూడా చరిత్రకారుల విధి.

**—ఆంధ్రజ్యోతి వారి, ఆరుద్రగారి సౌజన్యంతో.**

# చాటులేని చాటుధారలు

—డా॥ వేటూరి ఆనందమూర్తి

*["బ్రౌన్ జ్వర పీడితుడై" ఆవేగాన్ని చిక్కబట్టుకోలేక శ్రీ ప్రభాకరులను గూర్చి బంగోరె వ్రాసిన వ్రాత లన్నీ పునఃస్మరింపదగినవి కావు. ఆతడీనాడు మన మధ్య లేడు గనుక వక్తవ్యాన్ని పెంచకుండా ఆ వ్రాతలు అవాచ్యములు; అపోహలతో కూడినవి; దబ్బఱలు ఎఱుక చాలని బూకరింపులు అని అంటే చాలనుకొంటాము. ఈ సంచికలో ఉదాహరించిన విషయములు ఈ దిగువ పేర్కొంటున్న అంశములు అట్టిబూకరింపులను ఖండించునవి. ప్రభాకరుల మౌలిక పరిశ్రమను నిరూపించునవి. ఇవి కొన్ని మాత్రమే. ఇంకను పరిశీలించి ఉద్ధరింప దగిన విషయము లెన్నో ఉన్నవి. పరిశోధక విద్యార్థికి ప్రభాకరుల రచనలు పంట పొలములు. వారి గ్రంథాలయము నందలి వ్రాత ప్రతులు, కేటలాగులు, గ్రంథము లందలి మార్జినల్ నోట్సు వగైరాలు మొలకెత్తిన నారుమళ్లు- సం॥]*

## 1. క్రీడాభిరామము పీఠిక (1928) లో బ్రౌన్‌స్మరణ:-

"మఱియు నాంధ్ర భాషోద్ధారకులగు సి పి. బ్రౌన్ దొరగారు క్రీ 1830 కింకను బూర్వకాలముననే సంకలనము చేసిన చాటు ధారలలో* 'మీనవిలోచనం బులును' ఇత్యాది (క్రీడా 104) పద్యమును శ్రీనాథుని వీథి నాటకములోనిదానిగా సేకరించారు. దొరగారికి వేఱొక వీధినాటకము దొరకలేదు. వారు శ్రీనాథుని వీధి నాటకము లోనిదిగా విని సేకరించిన పయి పద్యము స్పష్టముగా, బూర్వోత్తర సందర్భములతో నీ క్రీడాభిరామమున నున్నది.

---

* తెలుగులో చాటుకవిత్వము - అంశములు 3 8; 3.14 లలో ప్రొ. జి. లలితగారును ఈ విషయాలను విశదీకరించినారు,

మఱియు నిప్పటి కేడెనిమిదియేండ్ల క్రిందట నేను గుంటూరు మండలమున మోదుకూరను గ్రామమున బల్లెం కనకరాజుగారని పేరుగల బట్రాజు గారింటం బ్రాచీన తాళపత్ర గ్రంథములం బరిశోధించుటలో హరిశ్చంద్రనలోపాఖ్యానపుం దాళపత్రప్రతి ముఖపత్రములం దీక్రింది వ్రాతను జూచితిని.

'కాకుళ్ల తిరునాళ్లనాడు చెప్పిన శ్రీనాథ వీథీనాటకం-హైమాగ్రాదనితంబ బింబ కుచహారాభీలభద్రా కృతుల్ కామాంధల్...' (క్రీడా. 209 పద్యమున నిది సమగ్రముగ చూడనగును).

చ. కలసి పెనంగు కాలమున...

ఈ రెండు పద్యములేకాక నేను చాటుపద్య మణిమంజరి రెండవ భాగమున గూర్చిన చాటు ధారలు ప్రౌఢదేవరాయల సభలో డిండిమ శ్రీనాథ వివాద సందర్భమందలి చాటు ధారలు పెక్కులు గూడ నక్కడ దొరకెను. శ్రీనాథుఁడు ప్రౌఢరాయల సభలో బాలా యువతీ ప్రౌఢా లోలల మీద చెప్పిన పద్యంబులును నందున్నవి. అవియెల్ల ననర్ఘ రత్నములు. తెనాలి తాలూకా మోదుకూరిలోను రేపల్లె తాలూకా పల్లెకోనలోను విద్వాంసులగు భట్టురాజులు పూర్వము వెలసియుండిరి. వారు సేకరించిన తాళపత్ర గ్రంథములు మంచివి నిన్న నేఁడు మంటిపాలయినవి. ఈ విషయము స్థలాంతరమున వ్రాసియుంటిని.''

[క్రీడాభిరామము 1928 ప్ర. ము. తృ. ము. 1960 పు. 39,40]

## 2. చాటు పద్యముల సేకరణ :- వ్రాతప్రతులు

1914 సం॥ ప్రభాకరులు ఆరంభించి అక్కడక్కడా సేకరించి ఒకచోట కూర్చిపెట్టుకొన్న చాటు పద్యాలు, కావ్యశకలాలు, పలుకుబళ్లు, వినోదకథలు, వగైరాలున్న నోటు బుక్కు నుండి కొన్ని ఇక్కడ ఉదాహరింపబడుతున్నవి. ఇట్టివి ఇంకా ఎన్నో నోట్సులున్నవి. వాటినన్నిటిని పరిశీలించి పరిశోధించి వర్గీకరించి ప్రకటించవలసి యున్నది.

ఈ 27 వ నెంబరుగల నోటు బుక్కు మొదటి పుటలో వారిలా వ్రాసుకొన్నారు:

"బూతుం బద్దెము లిందుం
జేతులు వడకాడ మనసు చీదర పడఁగా
రోతజనింపఁగ వ్రాసితి
నీతిపరుల్! లోఁ జదువుఁడు నిర్లేపముగాన్"

"పది నీతులు పది బూతులు
పది శృంగారములును బది పరిహాసంబుల్
గుది గూర్చి పుస్తకంబిది
గదియించితి సరసు లరసి కావలె ననఁగాన్."

- వేటూరి ప్రభాకరశాస్త్రి
(పెదకళ్లేపల్లి; మద్రాసు)
1914.

ఈ నోట్సు లోనే ఒక దగ్గిర (పుట 52) ఇలా ఉన్నది:

"ఈ పుస్తకం పరీధావి నామ సం॥ వైశాఖ శుద్ధ ౬ భానువారం వఱకూ బల్లెం అమ్మిరాజు వ్రాసినది. మాతృకలో ఉన్న ప్రకారం-"

*మోదుకూరు (తెనాలి తాలూకా) బల్లం కనకరాజు అనే భట్టురాజు ఇంట హరిచంద్రనలోపాఖ్యాన (సవ్యాఖ్యాన) ప్రతి మొదట 9 పత్రము లలోఁ గల పద్యములు :- ఎట్లా ఉన్నదో అట్లా వ్రాసినాను.*

[వాటి మొదళ్లు మధ్యలు మాత్రం కొన్ని ఇక్కడ ముద్రిస్తున్నాము]

కాకూళ్ల తిరునాళ్లనాడు చెప్పిన శ్రీనాథ వీథినాటకం

1. హైమగ్రావనితంబ భూరికుచభారాభీల శాతోదరుల్...
2. కలిసి పెనంగు కాలమున గాజుల చప్పుడు గాదు...
3. రాజమహేంద్రపు - 'హాజలజాక్షి...
4. శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయల దగ్గరకు వెళ్లినప్పుడు ముమ్మకవితో చెప్పిన పద్యములు ;-

''తరువున గాండివంబిడడె...''

ఏమి గ్రంథములు చెప్పినావంటే :- "చిన్నారి... తెనుగు చేసితి... భట్టమౌళి.''

"డంబుసూపి...దంటకవులకు బలువైన యింటి మగఁడ!'' రాజు ముమ్మ కవి కూర్చుండి నీవు యెట్లా కవిత్వం చెప్పుతావు అంటే చెప్పిన పద్యము: ''పంపావిరూపాక్ష-కళసాపుర ప్రాంత - నిర్నిబంధనిబంధమై - పలుక నేర్తు - ప్రౌఢ దేంద్ర రాయ భూపాల వరుని సమ్ముఖంబున దయ చేయు ముమ్మనుకవి.''

బాల, యువతి, లోల, ప్రౌఢలకుఁ జెప్పిన పద్యములు :-

బాల - ''కమనీయ కరపల్లవము మేను గదియంగ...

యువతి - ''కౌఁగిటిలోపల గదియంగ బిగియించి...

ప్రౌఢకు - ''అలకయుఁ గినుకయు...

లోల - ''చన్నులపైఁ జెయిచాప...

5. సీ. శ్రీరామ ? పతి పేళ్ల దొరలు రాచ కొమాళ్లు
వెలమ నాయళ్ల చేవెళ్ల గోళ్ల
కాళ్లను బాంకోళ్ల కడునోరసిగముళ్ల...
వింత కట్టు రుమాళ్ల బంతి కూళ్ల...

సీ. జిలుగు వన్నెరుమాళ్ళు చెవుల ముత్యపు జోళ్ళు
వెగలైన వడదోళ్ళు వేటకాళ్ళు
వారకాంతలయిళ్ళు వచ్చు రాచకొమాళ్ళు
నారీమణుల ఫెళ్ళు నారికెళ్ళు...

సీ. కాసుపుట్టని పూళ్ళు కరవు మజ్జిగ నీళ్ళు
పడిపొర్లు దేవళ్ళు పాడు గుళ్ళు
దరిబేసి సావళ్ళు మొరలు పెట్టు వరళ్ళు
పరువు లెత్తిడి వేళ్ళు పలుగు రాళ్ళు...

సీ. వాగు వెంబడి వూళ్ళు వరుసతో కల్ జోళ్ళు
పోలాసు యను పేళ్ళు పోఁగు నూళ్ళు
నడు వీథిలో రాళ్ళు నాఁటలే దేవళ్ళు
పరకట సావళ్ళు పాడు గుళ్ళు...
.........జెన్నాందుమారెళ్ళసీమ యందు.

సీ. పడుగేరుచోఁ జూచుఁ గుడి యెడమల యందు
సంచరించెడి విట సముదయముల...

ఉ. ఏండ్లకుఁ బెద్దకాదు తన యింటికి రమ్మని చేరదీసి...
గాండ్లది యెంతజాణ! కవిగాయక సంఘము మెచ్చునట్లుగాన్.

సీ. కపురంపు విడెపు.

ఇది శ్రీనాథుని దట!

సీ. నగము బోలెడు మేను సగము చేసెను గదా

ఖేచర, భూచర, జలచరములకు-

సీ॥ కలహంస కోవెల...
[26 పంక్తులున్నవి]
పక్షి జాతంబులీ రీతి బహు విధములు.

సీ॥ శరభంబు నేనుగుశాఖామృగంబును...
[13 పంక్తులున్నవి]
యాదిగా గల భూచరాలతిశయిల్లు.

సీ॥ తిమియు వాలుగ లంబ తిరికియు నెత్తము
పొసగ చారగుడేయి బొమ్మడాయి...
[13 పంక్తులున్నవి]

సీ. సర్వసర్వంసహా చక్రవర్తికి భట్టు
ఘనమైన నాయకాగ్రణికి భట్టు
..........................
లక్షణోపేంద్ర ప్రౌఢ రాయక్షితీంద్ర.

* * *

ఈ నోట్సులోనే మఱొక పుట (29) లో నున్నవి కొన్ని యివి :-

ఉ. అక్కఱ రాని చుట్టమును, ఆప్తులులేని గృహంబు, మిక్కిలిన్
మక్కువ లేని భార్య, పతిమన్ననలేని సుఖంబు, చేతిలో
రొక్కము లేని బేరమును, రోషములేని రణంబు, స్త్రీలకున్
ముక్కర లేని భూషణము. మోదమటే భువి, రాఘవేశ్వరా!

క. పతి మఱఁదియు సహదేవుఁడు
పతి బావయు ధర్మజుండు బావలు మఱఁదుల్
పతులు నర నకుల భీములు
పతులేవురు రావుసింగ! పాంచాలికిసన్.
మరొకటి

సీ చూచెనా ఒక వింత సుముఖుఁడై కవులకు
నవురౌర నూట పదాఱు లిచ్చు
మాటాడెనా లోభి మన్నీల మిండడిం
పార వేనూటపదాఱు లిచ్చు
నవ్వెనా ఒకమాఱు నాయక రత్నంబు
సంఖ్యగా లక్షల సంఖ్య లిచ్చు
సంతోషపడియెనా సకలార్థి పోషకుం
డరిదిగాఁ గోట్ల పర్యంత మిచ్చు
మెచ్చు... నౌనౌర మేలు మేలు
బళి బళి యనంగ ధరలోనఁ బ్రబలి తౌర
పృథుల సంపద్రమాజాని పెమ్మసాని
నారసింహేంద్ర సత్కవి నారసింహ.

ఇట్టివి యెన్నో పద్యములు శ్రీ ప్రభాకరులు సేకరించినవే దీపాలవారును సేకరించి తమ చాటుపద్య రత్నాకరమున ప్రకటించి యుండిరి. అట్టి వాటిలోని పాఠ భేదాలు, కథా సందర్భాలు, అవి విడివిడి సేకరణలని పేర్కొనడాని కాధారాలు. చా.ర. చూచుకొనవచ్చును.

కాళహస్తి నుండి సంపాదించిన పుస్తకములలో నున్న యీ ఆరు చాటువులున్న విషయం వ్రాసుకొన్న పాఠము-ఉన్నది ఉన్నట్లు.

ఉ. 'కన్యకునైదు పాదములు కన్యకు నాలుకుచద్వయింబులున్
కన్యకు నాల్గుకన్నొబములు కన్యకు నేడు విలోల నేత్రముల్
కన్యకు ద్వాదశం బనెడి కాచణ మధ్యము గల్గినట్టియో
కన్యక నీకు నాకు బది కావలయున్నద ముద్దుకోమలీ.

ఉ. ఆలికి యల్లుఁడై పిదప నల్లునికిం దగదానె యల్లుడై
యాలికి దండ్రియై మనుమరాలికి బెండ్లికొమారుఁడై సదా
యాలిమఅంది చెల్లెలికిఁదా పతియై మము బ్రోచునట్టి గో
పాలుఁడు రంగశాయి మన పాలగలండు విచారమేటికిన్.

ఉ. కోరికలుప్పతిల్ల మది గోరినయట్టి రహస్య కేళిలోఁ
జారుతరంబుగా రతుల సౌఖ్యమెఱుంగని జాణలెల్ల యీ
వారవధూశిరోమణిని వంతుల బెట్టు-దెబ్బ తీయుచీ
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరు మీరునున్.

ఉ. అద్రిస్నిగ్ధములంబుదద్బుచములుద్యద్దామ భూషావళుల్
క్షుద్రేదుంబరపాక పక్వ ఫలముల్ శుక్త్యస్త రాకాశమున్
రుద్రాక్షాక్షర పంక్తి విభ్రమము లీరూఢిన్ నిరూపింప నీ
శూద్ర ప్రజ్ఞలు విప్రసత్కవి వచస్ఫూర్తిన్విడంబించునే.

ఆ. ఆధ్యుడొక్కడున్న నందఱు పూజ్యులే
లెక్క మీద సున్న లెక్కినట్లు
అతడు పోవు వెనుక నందఱు పూజ్యులే
లెక్క చెప్ప సున్న లేగినట్లు.

కం. కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబు లుండ పండితుడౌనా ?
జంగులు జల్లులు గలిగిన
సింగారపు టూరుకుక్క సింగంబగునా !

ఇట్టి చాటువులన్నీ సుప్రసిద్ధములే. ఎవరెవరో ఎక్కడెక్కడో విని సేకరించి వ్రాసిపెట్టుకొన్నట్టివి. ఒకరిని చూచి ఒకరు మక్కికి మక్కి కాపీకొట్టినారని చెప్పడానికి వీలులేని విధంగా విభిన్న పాఠ భేదాలతో భిన్నభిన్న కాలాలలో భిన్నభిన్న ప్రాంతాలలో ఒకొక్కసారి భిన్నభిన్న కర్తృత్వాలు తెలిపే ఆకరాలతో గుర్తింపబడుతూ వుంటవి. ఇవి ఒకరి సొత్తు అని చెప్ప వీలుకాదు. ఉదాహరణకి చూడండి. కాళహస్తిలో కానవచ్చిన పై పద్యాలలో కొన్ని బ్రౌన్ సేకరణలోనూ ఉన్నవి. ఇతరత్రాను లభ్యమవుతున్నవి. (డి. 2884 - కన్యకు; కోరిక)-అడుదున్న; కెంగేల - చా.ప. మణిమంజరి.

చాటు పద్యాల సంగతి తెలిసినవారికీ వాటిని ఉద్ధరించి, సంస్కరించి, కథా సందర్భాలతో కూర్చి ప్రదర్శింపగల వైదుష్యమున్నవారికి వీటి విషయ మింతకన్నా వివరింపబనిలేదు. మరొక్క ఉదాహరణ మాత్రమిస్తున్నాను.

చూ. మణిమంజరి ఫిబ్రవరి 1981 సంచిక, పు. 88 లో ప్రకటింపబడిన "తప్పెను మూడిన" "బంధుకరవది" పద్యాలు నరసారావు పేట నుండి నీలం గోవిందరాజులు సేకరించి ప్రభాకరులకు (25-11-1930) పంపిన తొమ్మిది పద్యాల వివరాలందులో ఉన్నవి. వీటిలో 'బంధుకరవది' పద్యం చాటు పద్య మణిమంజరిలో గ్రహింపబడినది - గ్రామ నామాలను కూర్చి చెప్పినట్లు! ఇదే ఆరంభం కల పద్యం పాఠాంతరాలతో దీపాలవారి చా.ర.లోను సమస్యాపూర ణంగా ఉదాహృతమైనది. ఈ పద్యానికి మూడు నాలుగు పాఠాలు లభించినవి.

1924 లో ప్రభాకరులు సేకరించిన "సస్యముశీతమత్త" పద్యము గొట్టి ముక్కల నరసింహరాజు రచనగా పేర్కొనబడిన వివరాలకు చూ. మణిమంజరి ఆగస్టు 1981 సంచిక, పు. 156-160; ఇదే పద్యం పాఠ భేదాలతో దీపాలవారి సేకరమున కర్త పేరు లేకుండా ఉన్నది !

ఇలాటివి వందల కొలదిగా ప్రాచీన సంకలనాలలోను, తాళపత్ర గ్రంథాల ఆద్యంతాలలోను, పండితుల నోళ్లలోను అనేకానేక పాఠ భేదాలతో కానవస్తున్న వాటినే ఆసక్తిగలవారు సేకరిస్తారు. అవకాశమున్నప్పుడు ముద్రిస్తారు. ఆ సంకలనాల పరిష్కరణల తీరునుబట్టి వాటి వాటికి పేరు ప్రఖ్యాతులు కల్గుతూ వుంటాయి. వేటికో పేరొచ్చి పోయిందని ఎవరైనా వలవిస్తే ప్రయోజనమేమి ? ఇలాటి పద్యాలనే బ్రౌనూ ఆసక్తితో అనేకం సేకరించడం జరిగింది. పైన పేర్కొన్న పద్యాలు కొన్ని బ్రౌన్ సేకరణలోనూ ఉన్నవి. ఉంటాయి కూడా. పరిశీలిస్తే వాటిల్లో పాఠ భేదాలూ ఉండవచ్చు. కొన్ని యథాతథంగా ఉండవచ్చు. మరికొన్నిట గుర్తింపదగిన విశేషాలూ ఉండవచ్చు. ఈ అంశాలన్నీ మీద పేర్కొన్న ఉదాహరణల్లోనే చాలా కనిపిస్తున్నవి కదా ! వీటిని గ్రహించక మక్కికి మక్కి కాపీ కొట్టారు అనుకొనడం తగదు. వాటిని తగు విధంగా స్మరించి శ్రీ ప్రభాకరులు ప్రకటింపబూనడం ఒప్పేకాని తప్పుకాబోదు.

పై ఉదాహరణలు పరిశీలించిన తర్వాతనైనా ప్రభాకరుల చాటు పద్య మణిమంజరిలో బ్రౌన్ సేకరణలో (చిల్లర పద్యాలు; చాటు ధరలు) ఉన్న వాటి కన్నా అదనంగా ఒక్క పద్యమూ చూపలేదని అంటే అది ఎంతటి బూకరింపో అర్థం కాకపోదు. ఈ సందర్భాన ఆయన బ్రౌనుని స్మరించలేదనడం అంతకన్నా పచ్చి అబద్ధం.

చాటు పద్యా లెవరైనా సేకరించవచ్చును. కాని వాటిని పరిష్కరించి ప్రదర్శించడంలోనే పండితుల వైదుష్యం కనిపిస్తుంది. మీద పేర్కొన్న "పతి మఱదియు" పద్యాన్ని సేకరించడంలోని విశేషం కన్నా దీపాలవారు పేర్కొన్నట్లు "రాజుకోరిన ప్రశ్నకు మూలముగా సంస్కృతమున ఈ క్రింది శ్లోకమున్నది.

"ద్రౌపద్యాః పాండు తనయాః పతి దేవర భావుకాః
న దేవరో ధర్మరాజః సహదేవో నభావుకః"

రాజీ శ్లోకమును మనసున నుంచుకొనియే ప్రశ్నించేనేమో! అన్నటువంటి కథా సందర్భపు వ్యాఖ్యలను చేర్చడంలోనే పండితుల వైదుష్యం ప్రకాశిస్తుంది.

అలాగే చాటు పద్యాలను గూర్చి (15-7-1942 లో) వ్రాస్తూ ప్రభాకరులు (చూ మణిమంజరి ఫిబ్రవరి 1984 సంచిక, పు. 61-64) చాటు పద్య మణి

మంజరిలో అంతకు మునుపు చేరని కలగలపు భాషా పద్యం "భోజనం ఈగ సంకీర్ణం దోమ సంకీర్ణ మందిరమ్ శయనం నల్లి సంకీర్ణం దేహిమే కుంటి కూసమా'' అన్నది పాండవ గీతలలోని ''భోజనం మిత్ర సంకీర్ణం బంధు సంకీర్ణ మందిరమ్ శయనం సుత సంకీర్ణం దేహిమే మధుసూదన'' అన్న శ్లోకాన్ని తలపించేది అని వ్రాశారు చూడండి - అలాటి సన్నివేశాల్లోనే పెద్దలైన పండితుల వైదుష్యం ప్రతిఫలిస్తుంది. చాటు పద్యాల సేకరణతోపాటు ఇటువంటి వైదుష్యం వేటూరివారిలో కానవస్తుంది దీపాల వారిలో కనిపిస్తుంది; బ్రౌన్ కోసం ఇలాటి వాటిని సేకరించి విశేషాలతో అందించిన ఆనాటి బ్రౌన్ పండిత మండలిలోను గోచరిస్తుంది-శ్రద్ధగా పరిశీలిస్తే! లేదంటే ఆ మాట వట్టి బొంకు.

## 3. కలగూర గంప

*[సి. పి. బ్రౌన్ జీవిత సంగ్రహానికై ప్రభాకరులు 1927-28 సం॥లలో తమ నోట్సుల్లో గుర్తువ్రాసుకొన్న అంశాలివి —సం॥]*

I రాయల్ ఏష్యాటిక్ ఆన్యూల్ రిపోర్టు — 1885 లో బ్రౌన్ చరిత్ర.

II D.F. కార్మైకెల్ బ్రౌన్ చరిత్ర పుస్తకముగా వ్రాసి ప్రకటించినాడు.

III అథీనియమ్ నెం. 2984.

IV ట్రైమ్సు-20, డిసెంబరు 1884.

V Dictionary of National Biographies, volume VII, Page 2-3. డిక్షనరీ వాల్యూం VII. P. 2-3.

VI 12-2-4 బ్రౌన్ కేటలాగు. బందరులో 1835 సం॥ అసిస్టెంటు జడ్జిగా నున్నప్పుడు ప్రారంభించి వ్రాయించిన కేటలాగు - ఇందులో - నేను మెకంజీ లైబ్రరీ పుస్తకాలన్నీ పరిశీలించితిననీ, అందు తన దగ్గరలేని అపూర్వ గ్రంథాలేవీ లేవనీ, ఉన్నవాటిని తన పుస్తకాలతో కంపేరుచేసి ఆ లాభం అంతా పొందినాననీ వ్రాశాడు.

VII Brown Dictionary 1st Edition లో పీఠికలు చూచునది.

VIII విల్సన్ కేటలాగులో బ్రౌన్ వ్రాసిన వ్రాత చూచునది.

IX లోకల్ రికార్డు ప్రింటెడ్ కేటలాగు పీఠిక చూచునది.

X లోకల్ రికార్డు 14 వ వాల్యూంలో బ్రౌన్ గూర్చి పద్యాలు వగైరా గలవు.

XI 13-6-27; 14-11-18 - బ్రౌన్ చాటువులు. 12-2-11 - బ్రౌన్ వ్యాకరణము.

XII 12-2-22. Brown టీకలు వ్రాయించిన తెలుగు పుస్తకాల పేర్లున్నవి.

1831 సం॥ డిసెంబరు 29 కి జూలూరి అప్పయ్య మనుచరిత్ర టీక ముగించెను.

1832 మనుచరిత్ర విషయసూచి బందరులో.

1850 తారాశశాంక శబ్దసూచి నలుగురు మనుష్యులకు 4 నెలలు పట్టినది. 14-4-5 చూ.

1826 కడపలో హంసవింశతిని వ్రాయించాడు.

1847 హరిశ్చంద్రనలోపాఖ్యానము వ్రాయించెను.

,, ,, వ్యాఖ్య వెంకటసుబ్బయ్యశాస్త్రి సవరించెను. D 930.

1845 హంసవింశతి వ్రాయించెను. ఆముక్తమాల్యద శబ్దసూచి. బ్రౌన్ సి.పి. తెలుగు రీడరు - కానిమరా లైబ్రరీ. 14;49 లో బ్రౌన్ దొర గవర్నమెంటు ట్రాన్స్లేటరుగా ఉన్నాడు. ఆముక్తమాల్యద శబ్ద సూచి. చూ.

XIII Brown - అసిస్టెంటు జడ్జి - పోస్టుమాస్టర్ జనరల్.

1853 బ్రౌనుకు జబ్బు చేసింది.

యోగీశ్వర విలాసము 12-3-33 (3)

ఈ గ్రంథము ఆక్స్ఫర్డు బాడ్లియన్ లైబ్రరీలో కలదని బ్రౌన్ దొరగారు వ్రాసిరి.

నవనాథ చరిత్ర 13-5-10.

1841 సం॥ మే నెల 28 తేదీ ఈ గ్రంథము తిరుమలనాయడు బ్రహ్మయ్య, పీర్లచే సీమలో నుంచి వచ్చిన మాతృకతో ముఖావిలా చాయడమైనది.

8)

12-8-19 వక్కలంక వీరభద్రకవి చెప్పిన చాటువులు వత్సవాయవారి మీదివి ఉన్నవి.

## 4. శ్రీ ప్రభాకరులు చూచి వర్ణించిన ప్రాచీన కవుల చాటుధారలు; కావ్య శకలాలు :

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం వారు 1917 మొదలుకొని ప్రచురించిన ట్రెన్నియల్, డిస్క్రిప్టివ్ కేటలాగులలో వర్ణింపబడిన విషయాలన్నీ ప్రభాకారులానాడు చూచి చదివి గుర్తించి వ్రాసినవే. ఈ అంశం చాలా మందికి తెలియకపోవచ్చును కానీ వాసిగాంచిన పండిత పరిశోధకు లందరూ ఎరిగిన సత్యమే. కనీసం వీటిని పరిశీలించినా తెలుగు కవుల చరిత్రకు; చాటుధారల - కావ్యశకలాల సేకరణకు; బ్రౌన్ దొరను - ఆయన వాఙ్మయ సేవను గూర్చిన పరిశోధనకు ప్రభాకరులు గావించిన కృషి యెట్టిదో విశదం కాగలదు. ఈ విశేషాలు విడిగా విస్తరించి వ్రాయదగినవి. ఒక్క మాటలో చెప్పాలంటే ఈనాడు మన విద్యా సంస్థల్లో ఎన్నో ప్రాజెక్టుల పేర సాగుతున్న వాఙ్మయ కృషికి పదిరెట్లు పరిశ్రమ మౌలికంగా మనకా కేటలాగు పుటలలో కానవస్తుంది. వారందు గుర్తించిన చాటుపద్యాలకు కావ్యశకలాలకు ఇతర విశేషాలకు ఈ క్రింది నెంబర్లు పరిశీలింపదగును.

D 1029; 1050 (58a); 1058, 1095, 1176; 1467 (4a); 1471 (277a); 1491 (18a); 1519 (79a); 1543 (58); 1544; 1547 (58a); 1596 (13b); 1602; 1607; 1611(13a); 1612 (14a); 1776; 1809; 1575; 1782;

R Nos. 233 (e); 235; 447; 542; 560; 636; 648.
1; 13; 31; 54; 109; 117; 128;

వీటిలో మఱికొన్ని త్వరలో రానున్న చాటుపద్య మణిమంజరి సంపుటములలో చేరనున్నవి.

లైబ్రరీలోని కొన్ని ప్రబంధాల వ్రాత ప్రతులను బట్టీ, అందుగల వ్రాతలను బట్టీ తెలియదగిన విషయాలు బ్రౌనుదొరను గురించి, బ్రౌన్ పండితులను గురించి,

వారివారి రచనావ్యాసంగాలను గురించి, బ్రౌనుదొరకు తోడ్పడిన వ్రాయసగాండ్రను గురించి, ఎన్నో మనకా సంపుటాలలో కానవస్తాయి.

ఉదాహరణకు 1927 లో ప్రకటింపబడిన వాల్యూం II పార్టు 2 డిస్క్రిప్టివ్ కేటలాగులోని దిగువ నెంబర్లు పరికింపవగును.

D 641 (మనుచరిత్ర టీక 1831 డిసెంబరు 29 సంపూర్ణం); 642 (మను చరిత్ర శబ్దసూచి 1832); 649 (మాజేటి సర్వేశలింగము - బ్రౌన్ వ్రాయసగాడు); 686 (నరసింహాచారి విరచిత రాఘవపాండవీయ టీక); 706 (పమిడిపాటి వెంకటనరసయ్య బ్రౌన్ ఆజ్ఞ మేరకు 1829 సం॥న రాధామాధవ సంవాద టీకను వ్రాసెను); 708; 760 (వసు చరిత్ర-సటీకము బ్రౌన్‌దొరవారి యాజ్ఞ ననుసరించి ములుపాక బుచ్చయ్యశాస్త్రిగారు కూర్చిన "ప్రతిపదార్థ ప్రకాశిక" - ఇందులోనే-

నూర్లార్లు లెక్కసేయక
పేర్గందిన విబుధజనుల బిలిపించుచు వే
మార్లర్థ మిచ్చు వితరణి
చార్లీసు పిలుప్పు బ్రౌను సాహెబు కరుణన్.

అను పద్యముతో కూడిన పదకొండు పద్యాలు ఉదాహరింపబడినవి. బంగోరే బ్రౌను ప్రాజెక్టు పుట్టడానికంటే ఏభై యేళ్ళకు పూర్వమే ఆ వివరాలన్నీ ప్రభాకరులీ సంపుటంలో ముద్రించివున్నారు); 785 (విజయవిలాస వ్యాఖ్య జూలూరి అప్పయ్య పంతులు-1830 డిసెంబరు 11 వ తేదీన ముగించెను.)

బ్రౌన్ కేటలాగుకి సంబంధించిన మరొక విషయం పేర్కొని ఈ వ్యాసం ముగిస్తాను.

## 5. శ్రీ ప్రభాకరుల లైబ్రరీలోనున్న బ్రౌన్ కేటలాగు (1840) అచ్చుప్రతిలోని వివరాలు :

చన్న పట్టణమందు కాలీజాలో వుండే
చార్లెసు-ఫిలీపు బ్రౌన్ ధొరగారి
దగ్గెరవుండే గీర్వాణ
పుస్తకముల యొక్క పట్టి

౫౦] పురాణ పట్టి
స్కాందం॥ ఈశాన సంహిత...... (౧౮ పుటలు. గీర్వాణ పుస్తకముల యొక్క పట్టి)

[ముగింపు] అశ్వశాస్త్ర పట్టి
అశ్వశాస్త్రం - హయలక్షణ విలాసం
రత్నశాస్త్ర పట్టి
రత్నశాస్త్రం - గీ - టీక - పద్యకావ్యం కూడా (౧౩ పుటలు తెనుగు గ్రంథముల పట్టి)

---

ఇది చెన్నపట్టణపు వృత్తాంతి ఆఫీసులో అచ్చు వేయబడ్డది.

---

Originals of the Extracts from Telugu Poems translated in Essay on Telugu Literature by C.P. Brown.

Extract from Dwipada Ramayan Aranya canda - Tale of the Golden Deer (Magic Deer) P. 45-58

Tale of Sarangadhara P. 59-63

The Birth and youth of Maia-Prabhulinga Lila P. 64-78.

---

Theese pages 45 to 78 are to be placed at the end of No. 26 of rhe Madras Journal.

MADRAS

Printed by R.W. THORPE, at the Vepery Mission Press; and Published by J.B. PHAROAH. Price 1 Rupee. 1840.

# శ్రీ కూర్మాష్టకము

## చాటుపద్య - మణి మంజరి (సంకలనము)

—— వేటూరి ప్రభాకరశాస్త్రి

శ్రీ లక్ష్మి రమణీ మనోహరకరా సీమంతినీ కామినీ
యీలా గిప్పుడు తల్పు వేయఁదగునా యీవేళ లక్ష్మిసతీ!
మేలా యర్ధపురాత్రివేళ ధరలో మీరిందు రాఁజెల్లునా
స్త్రీల న్నెచ్చట నుంచి వచ్చితివిరా శ్రీకూర్మరాయాధిపా!

లలనా! స్త్రీలను జూచుటే యెఱుఁగనే లావణ్య బింబాధరీ
యిలలో భక్తులఁ జూడ నే నరిగితి న్నీవేళ లక్ష్మిసతీ!
కలదో భక్తుల రాత్రియందుఁ గను టేకంజాక్షి బోధించె నీ
చెలువ న్నాటక మాట విన్న నగరా శ్రీకూర్మ రాయాధిపా!

రామా! నే నపరాధిగాను వినవే రమ్మంచు మన్నించవే
యేమే కామునిబారి కోర్వఁగలనా యీవేళ లక్ష్మిసతీ!
స్వామీ మిక్కిలి మక్కువైన పొలతుల్ సాధ్యంబుగా నుండఁగా
శ్రీమంతుండవు నాదు జోలికలదా శ్రీకూర్మరాయాధిపా!

మఱి యేకాంత నెఱుఁగ నమ్మము సఖీ మా రాడకే వేడెదన్
తరుణీ శేషునినైనఁ బట్టెదను వింతా! చాలు నేకాంతమున్
మఱగేపఁచును శేషశాయి యనుచున్ నారుల్ నిసన్ మెచ్చరా
ఒరు లీ మాటల నేర్పు విన్న నగరా యో కూర్మరాయాధిపా!

నే నీవాఁడ నటంచు నెంచవుగదా నీలాలకాభాలకా!
(నీ నా) పొందెడ సేయ వచ్చిరెవరో నిక్కంబు లక్ష్మీసతీ!
కానీ టక్కులకేమి పోవెడలు నీ కార్యంబు లిందేమిరా
శ్రీ నారాయణమూర్తి వంచుఁ దెలిసెన్ శ్రీకూర్మరాయాధిపా!

బాలా! నిన్నెడబాసి తాళఁగలనా భావించి మేలెంచవే
శీలుండంచును నన్నెఱుంగ వటవే శ్రీలక్ష్మిదేవీ సతీ!
మేలే యింతులు నిన్నుఁ బాయఁగలరా మేమెందురా చాలు నీ
శీలం బిక్కడఁ జెల్లునా తగదుపో శ్రీ కూర్మరాయాధిపా!

మ్రొక్కే నిప్పుడు తల్పు తీయఁగదవే మోమిచ్చి వీక్షించవే
దక్కే నంచుఁ బెనంగ జేయుటయు శ్రీధర్మంబు లక్ష్మీసతీ!
దక్కే నంచుఁ బెనంగ చేసికొను టేధర్మంబు నేనేలరా
మ్రొక్కే దాని వశీకరంబుగని రమ్మా కూర్మరాయాధిపా!

ఏరీ నీ సరికాంత లీజగములో యిందీవరాక్షీమణీ
జేరీ నీ మరురాజ్య మేలుటరుదే శ్రీ ముద్దు లక్ష్మీసతీ!
రారా మాటల సౌక్కనేని రతులం రంజిల్ల నన్నేలరా
శ్రీరామేశ్వర ప్రీతుఁడైన సుగుణా శ్రీకూర్మరాయాధిపా!



# నాచన సోమనాథుని

# ఉత్తర హరివంశము

## సవ్యాఖ్యానము

[వెనుకటి సంచిక తరువాయి]

—వేటూరి ప్రభాకరశా

[వెనుకటి సంచికలో ముద్రించిన మా మనవినే తిరిగి ఈ సంచికలోను ప్రకటిస్తున్నాము ఉదారులైన సహృదయుల తోడ్పాటున కెదురుచూస్తున్నాము.

మేము ప్రకటించుచున్న మాదిరి బాగానే ఉన్నదనీ, అయితే మణిమంజరి పత్రికలో భాగాలుగా కాక ఒక్కసారి చదువుకొనే అవకాశం కలిగేటట్లు గ్రంథ మంతా వెంటనే ముద్రించవలెననీ మిత్రులు కొందరు వ్రాసిరి. పరిచయము కొరకేగానీ గ్రంథమంతా పత్రికలో ప్రకటించే ఉద్దేశం మాకూలేదు. గ్రంథాన్ని వెంటనే ప్రకటించవలెననియే మా సంకల్పమును. అయితే ముద్రణ ఖర్చు ముప్పది వేలకు పైపడునని ప్రెస్సువారి అంచనా. ఉదారులు తోడుపడి ప్రెస్సు, పేపరు ఖర్చులకు ఆర్థిక సహాయమో, అప్పో ఇవ్వగల్గినా, వారిని స్మరించి ఈ గ్రంథాన్ని వెంటనే అచ్చుకివ్వడానికి వీలుకల్గుతుందని ట్రస్టువారి తలంపు వారి యీ అభ్యర్థనను సహృదయులు మన్నిస్తారనే ఆశిస్తాము - సం॥]

మ. తనపీడన్ హరియుండ, రాక్షసులు రత్నస్వర్ణ సందోహమున్
వినతిం గప్పముదేరఁ బుచ్చికొనఁ, దద్విఘ్నంబు గావించినన్
వనదత్తాఖ్యుల దైత్యులం దునుమ నోర్వం జాల కంభోరుహా
సనుచేతన్ నరకుండు లబ్ధవరుఁడై చాలెం గ్రియాహానికిన్. **14**

వ్యా. *ద్వారకా నగరమున శ్రీకృష్ణదేవుఁడు సుఖముగా నుండు టయు, ఆ దేవునకు రాక్షసులు వినతితోఁ గప్పములు దెచ్చుటయు, వాని*

నాదేవుడు కైకొనుటయు, - అట్లు శ్రీకృష్ణునకుఁ గప్పమీయకుండ నడ్డు కల్పించిన వాండ్రను - వనదత్తు లనుపేరుగల ('వరదృప్తాన్) - [వర దత్తాన్] మహాసురాన్' అని సంస్కృత మూలము) రాక్షసులను శ్రీకృష్ణుడు చంపుటయు, ఓర్వఁజాలనివాఁడై నరకాసురుఁడు బ్రహ్మచేత వరములు వడసి ద్వారకలో శ్రీకృష్ణుని సుఖస్థితి మొదలగు కార్యముల హానిగావింపఁ జాలినవాఁడాయెను. ఈ పద్యమున హరియుండి-దేరఁబుచ్చుకొను-దైత్యాలం దునుము - అను పాఠములు గూడ నున్నవి. వానికంటె సుందరమని పై పాఠమునే కయికొంటిని. ఇందు నరకుఁ డోర్వఁ జాలకుండఁ జేసినవి- హరి యుండుట, రాక్షసులు గప్పముదెచ్చుట, దాని హరి పుచ్చుకొనుట, వనదత్తాఖ్యులఁ దునుముట-అనునవి యెల్లను.

[హరి = శ్రీకృష్ణుడు, తనపీటన్ = తన నగరమునందు (ద్వారకా నగరమునందు). ఉండన్ = ఉండుట(కు)ను, రాక్షసులు = రక్కసులు, రత్న = రత్నముల యొక్కయు, స్వర్ణ = బంగారము యొక్కయు, సందోహమున్ = సమూహమును, వినతిన్ = అడఁకువతో, కప్పము, తేరన్ = తేఁగా, పుచ్చి కొనన్ = పుచ్చుకొనుట(కు)ను, తత్ విఘ్నంబు = ఆ కప్పములొసగుటకు విఘ్న మును, కావింపఁగన్ = చేయఁగా, వనదత్త ఆఖ్యులన్ = వనదత్తులను పేరుగల, దైత్యులన్ = రాక్షసులను, తునుమన్ = సంహరించుట(కు)ను, ఓర్వన్‌చాలక = సహింపజాలక, నరకుండు = నరకాసురుడు, అంభోరుహ ఆసనుచేతన్ = బ్రహ్మదేవునిచే, లబ్ధవరుఁడు = పొందఁబడిన వరములు కలవాడు, ఐ = అయి, క్రియాహానికిన్ = పయిన బేర్కొనబడిన శ్రీకృష్ణుని కార్యముల యుపద్రవము నకు, చాలెన్ = సమర్థుడయ్యెను.

తాత్పర్యము : శ్రీకృష్ణుఁడు ద్వారకా నగరమున సుఖముగా నుండు టయు, రాక్షసులు రత్నములను, బంగారమును గప్పముగాఁ దెచ్చి యొసఁగఁ బుచ్చుకొనుటయు, దానికి విఘాతము కల్పించిన వనదత్తు లనుపేరుగల రాక్షసులఁ జంపుటయు నోర్వఁజాలక నరకాసురుఁడు బ్రహ్మదేవునిఁగూర్చి తపస్సుచేసి యాతని వలన వరములు పొంది పయికార్యములకు హానికూర్చు చుండెను.

విశే॥ 'వనదత్తాఖ్యుల దైత్యులందునుము...' వరదృప్తాన్, మహాబలాన్, వరదత్తాన్ మహాబలాన్ అనియు సంస్కృత మూల ప్రతులందు పాఠములు కలవు కాని సోముని పద్యమున 'వనదత్త' యని ప్రాస స్థానమున నుండుటచే నది మార్పఁ గుదురదు.

ఇందు నరకు నోర్వఁజాలకుండఁ జేసినవి-హరి తన పీట (సుఖముగా) నుండుట, రాక్షసులు కప్పముఁదెచ్చుట, హరి దానిఁ బుచ్చుకొనుట, తద్విఘ్నము కావించిన వనదత్తు లనుపేరుగల రాక్షసులను జంపుట యనునవి.

*'హరియుండి, కప్పముఁదేరఁబుచ్చికొను, దైత్యులందునుము'* అను పాఠాంతరములున్నవి కాని వానితోఁ బద్యాన్వయము చక్కఁగాఁ గుదురదు. వాని కంటె పయి పాఠములె హృద్యములు.]

**మ.** **అతఁడంతంతకు వాలు[1]వాలుబలిమిన్ హాలాహలాహం**
**క్రియా (వాలి[1])**
**ద్భుతభంగిన్ వివిధాస్త్రజాలము[2] సమిద్భూమిన్ వెలార్పన్[3] బ్రభా**
**(వివిధాస్త్రధారలు[2]) (ర్చున్[3])**
**పతి పాద[4]ద్యుతి సోఁకనాత్మ[5]రథినీ పాదాతకుంతంబులం**
**(తీవ్ర[4]) (సోదరా ప్త[5])**
**బ్రతివీర ప్రమదాకపోలఫలకప్రాంతాలకాంతంబులన్** **15**

*వ్యా. అతఁడు; వాలుబలిమిన్ = ఖడ్గ పరాక్రమముతో; సమిద్భూమిన్ = యుద్ధభూమియందు; (సాగరము వెడలిన) హాలాహలాహంక్రియాద్భుత భంగిన్; వివిధాస్త్రజాలమున్; వెలార్పన్; ఎట్లనఁగా - ఆత్మరథినీ...కుంతంబులన్ = తన సేనలోని పదాతులచేతులలోని యీఁటెల మీఁదను; ప్రతివీర...కుంతంబులన్ = ప్రతివీరుల యంతఃపురికల కపోల ఫలకముల ప్రాంతపుఁ జూర్ణాలకాంతముల మీఁదను. ప్రభాపతి పాదద్యుతి = సూర్యకిరణ కాంతి; (చీకట్ల మీఁదంబోలె) సోకన్; - అనఁగా అతని ఖడ్గకాంతి తన సైన్యపుఁ గుంతముల మీఁద (పడి) వెలిగింపను, దన శస్త్రాస్త్రప్రయోగముల కాంతి ప్రతివీరుల నాశపుగగ్గోలు కల్గించుటచే*

*నసూర్యాంపశ్యాలయిన వారి యంతఃపురికలు బయళ్లకువచ్చి పలవించుటయు, అప్పుడు వారి చెక్కిళ్లమీఁద వాలిన జూర్ణలకముల (చీకట్ల) మీఁదఁగూడ నా (సూర్యకిరణ) కాంతులు ప్రసరించుటయు జరగించుట ఆ నరకాసురుఁ డంతకంతకు విజృంభింపసాగెను.*

[అతఁడు = ఆ నరకాసురుడు, వాలుబలిమిన్ = ఖడ్గ పరాక్రమముతో, సమిత్భూమిన్ = యుద్ధభూమియందు, హాలాహలా...భంగిన్- హాలాహల = కాలకూట విషముయొక్క, అహంక్రియా = విజృంభణముతో సమమైన, అద్భుత = ఆశ్చర్యకరమయిన, భంగిన్ = విధముతో, వివిధ = అనేక విధములైన, అస్త్రజాలము = అస్త్రముల సమూహమును, వెలార్పన్ = ప్రకాశింపఁజేయఁగా, ప్రభాపతి = సూర్యునియొక్క, పాద = కిరణముల, ద్యుతి = కాంతి, ఆత్మ = తనయొక్క, రథినీ = సైన్యములోని, పాదాత = పదాతుల చేతులయందుఁగల కుంతంబులన్ = ఈటెల మీఁదను, ప్రతివీర...కుంతంబులన్, ప్రతివీర = శత్రువీరులయొక్క, ప్రమదా = స్త్రీలయొక్క, కపోలఫలక = ఫలకముల వంటి చెక్కిళ్లయొక్క, ప్రాంత = సమీపమునగల, అలకా = చూర్ణకుంతలముల యొక్క, అంతంబులన్ = అగ్రములను, సోఁకన్ = తాకఁగా, అంతంతకు = అంతకంత క్రమముగా, వాలు = అతిశయించును.

తాత్పర్యము : నరకాసురుండు వరలాభముచేతను, పరాక్రమాతిశయము చేతను అంతంతకు విజృంభింప సాగెను. అతఁడు తన ఖడ్గబలమును, వివిధాస్త్రములను వెలార్పఁగా సముద్ర మథన సమయమున హాలాహల మెగసినట్లాహవ భూమి యల్లకల్లోలమైనది. అప్పుడాతని శస్త్రాస్త్ర ప్రయోగముల కాంతి సూర్య కాంతినిబోలినదై తన సైన్యములోని పదాతుల చేతులోని యీటెలమీఁదను, శత్రువీరుల భార్యలయొక్క చెక్కిళ్లమీఁదఁబడుచున్న చూర్ణాలకముల మీఁదను బడుచుండెను.

విశే : నరకాసురుఁడు తన ఖడ్గమును ఝళిపించి వివిధాస్త్రజాలమును వెలార్చి విజృంభింపఁగా రణరంగము క్షుభితమై మథింపబడిన సాగరమున హాలాహల ముదయించినంత గగ్గోలు పుట్టినది. అప్పుడాతని యస్త్ర శస్త్రముల కాంతి తన పదాతి సైనికుల చేతుల యీటెలపైఁబడి ప్రతిఫలించి ప్రభాపతియగు సహస్ర కిరణుని తలపింపఁ జేసినది. అట్టి పరాక్రమ విజృంభణము కారణముగా

శత్రువీరులెందరో మడియఁగా నసూర్యంపశ్యలయిన వారి యంతఃపురికలు తమ నాథుల శవముల గుర్తించుటకై రణరంగమునకు రాగా నా యస్త్రశస్త్రముల కాంతి సూర్యకాంతిని బోలినదై వారి చెక్కిళ్లమీఁద బ్రవాలుచుండిన చూర్ణాలకముల (చీకట్ల) మీఁదను బ్రసరించినది. ఆ విధమున నరకాసురుఁడంతకంతకతిశయించెను. వాలివాలు, వెలార్చున్, సోదరాస్త్రరథినీ అను పూర్వ పాఠములతోఁ బద్యాన్వయము పొసగదు. అందుచే మేలు పాఠములఁ గూర్చుకొని 'సోఁకనాత్మరథినీ' అని పద్యము సవరింపబడినది.]

మ. ధనదాంతఃపురతారహారములు యాదఃపాల బాలా ఘన
స్తన కాశ్మీరము ధర్మరాట్కులవధూసంవ్యాన కౌశేయమున్
దనుజేంద్రారి వరావరోధ దయితా ధమ్మిల్ల మాల్యంబులున్
గినుకం దెచ్చి ఘటింపఁజూచు జయలక్ష్మి నిత్యనైపథ్యమున్. 16

వ్యా. ఆతఁడు కోపముతో నెత్తిచని కుబేరుని యంతఃపురపు (స్త్రీల) ముత్యాల హారములు, వరుణుని జవరాండ్ర ఘనస్తనముల మీఁది కుంకుమ పూవు, యముని యిల్లాండ్ర యుత్తరీయపుఁ (పైఁట) బట్టువల్వలు ఇంద్రుని యంతఃపురాంగనల కొప్పులలోని పూలమాలలు కొనివచ్చి జయలక్ష్మికి నిత్యాలంకరణములు ఘటింపఁ దలపోయును.- పులిపాలు తెచ్చుట, పులి మీసలతో నుయ్యాలలూగుట- అను మీఱినవి పై వస్తువులఁ దెచ్చుట. అవి దిక్పాలక చతుష్టయము తనకోడిపోయి, వారి స్త్రీలు తనకు వశపడినఁ గాని సాధ్యము కానివి. ఈ పద్యమున- ధనదాంతఃపురపు తారహారములు మొదలగువానిఁ జెప్పుటలోఁ జమత్కార విశేషమున్నట్లు తోఁపదు. ధనదాంతఃపుర తారహారమునకు బదులు కాశ్మీరమన్నను, కౌశేయమన్నను, మాల్యములన్నను నొకటే - ఆయా దిగధిపతుల కవియవి చెప్పుటలో విశేషము లేదు. నరకునకు దిగ్విజయము జరపుటలో నక్కడ జయస్తంభములు నాటుటో, తన పేరఁ బురములు నిర్మించుటో, ఇంకేవేని పుణ్యకార్యములు చేయుటో కాదు కోరిక; ఆయా దిక్పాలకుల యిల్లాండ్ర యూలువులు చెఱుచుట; వారి హారములు, పైఁటలు మొదలగువాని లాగికొనివచ్చి జయోత్సవానంద మనుభవించుట; ఇది వాని వెకలితనమునకుఁ దగియున్నది. తారహారాదులు తెల్లనవి. కాశ్మీర మెఱ్ఱనిది. కీర్తి ప్రతాపముల

కివి తార్కాణలు. నరకుని దిగ్విజయ వాంఛలో నుత్తర దిగీశ్వరుఁడగు కుబేరుని మొదలొక్కని యప్రదక్షిణముగా, జతుర్దిగీశులను జెప్పుట యమంగళము. ఇది నరకు సంకల్పమున కీయపక్రమము సరిపోయినది. వాని సంకల్పపు విధ్వంసమున కీయపక్రమము వ్యంజకము. మఱియు లక్ష్మికి నేపథ్యము గూర్చుటకు వస్తువు లానందముతోఁగాక కినుకతోఁ దెచ్చుట కూడా వానికిఁ దగినట్లే ఉన్నది.

[అతఁడు (పూర్వపద్యమునఁ గర్త), ధనదాం...ములు-ధనద = కుబేరునియొక్క, అంతఃపుర = అంతఃపురమునందలి, తారహారములున్ = ముత్యాల హారములును, యాదః...కాశ్మీరము- యదఃపాల = వరుణునియొక్క, బాలా = స్త్రీలయొక్క, ఘన = పెద్దవగు, స్తన = చన్నులమీఁది, కాశ్మీరమున్ = కుంకుమపూవును, ధర్మరాట్కుల... కౌశేయమున్- ధర్మరాట్ = యమధర్మ రాజుయొక్క, కులవధూ = కులకాంతలయొక్క, సంవ్యాన = ఉత్తరీయమయిన, కౌశేయమున్ = పట్టువస్త్రమును, దనుజేం ... మాల్యంబులున్- దనుజ అరాతి = రాక్షసుల శత్రువగు దేవేంద్రునియొక్క, వర = శ్రేష్ఠమయిన, అవరోధ దయితా = అంతఃపుర స్త్రీలయొక్క, ధమ్మిల్ల = కొప్పులలోని, మాల్యంబులున్ = పూలమాలలును, కినుకన్ = కోపముతో, తెచ్చి, జయలక్ష్మి = విజయలక్ష్మి యను కాంతను. నిత్య = శాశ్వతమయిన, నైపథ్యమున్ = అలంకరణమును, ఘటింపన్ = చేయుటకు, చూచున్ = ప్రయత్నించును

తాత్పర్యము : నరకాసురుఁడు దక్పాలకులపైఁ గోపముతో నెత్తిచని కుబేరుని యంతఃపురములోని ముత్యాలహారములును, వరుణదేవుని కాంతలు స్తనములకుఁ బూసికొను కుంకుమ పూవును, యమధర్మరాజు యొక్క కుల కాంత లుత్తరీయముగా ధరించు పట్టు వల్వలను, దేవేంద్రుని యవరోధ కాంతలు తమ కొప్పులందు ముడుచుకొను పుష్ప మాలికలను దెచ్చి తన్నుఁ జేపట్టిన విజయలక్ష్మి నలంకరింప నెంచును.

విశే : నరకాసురుఁడు కుబేరుఁడు మొదలగు దిక్పాలకుల నెల్ల జయించినఁ గాని వారి యంతఃపురములలోని యంతఃపురికల తారహారాదు లితనికిఁ జేపడవు. అవి చేపడినట్లు వానితో జయలక్ష్మి నలంకరింతునన్నట్లు గల నరకుని తల

పోతలలో నాతని మనఃస్థితియు భవిష్యద్వర్తనమును సూచితము లగుచున్నవి. ఇందు నరకుఁడు తెచ్చిన తారహారాదులు తెల్లనివి. కాశ్మీర మెఱ్ఱనిది. అవి యాతని కీర్తి ప్రతాపములకుఁ దార్కాణాలు. నరకుని దిగ్విజయ యాత్రలో నుత్తర దిగధీశ్వరుడగు కుబేరునితో నుపక్రమించి యప్రదక్షిణముగాఁ దక్కిన దిగధీశ్వరులను బేర్కొనుటవలన అమంగళము సూచితము. ఇది యచిర కాలములో నరకునికిఁ గలుగనున్న వినాశమును సూచించుచున్నది.]

వ. ఇట్లు వర్తించి దిగ్విజయంబు సేయు తలంపున- **17.**

[ సశేషము ]

చూ. పుట. 126 ఫోటో. సంస్కృత కళాశాల - తిరుపతి 26-3-1941

On chairs : (1) Sri K. Subramhania Sastry, (2) Sri T. A. Vankateswara Dikshitar (Principal) (3) Sri V. Prabhakara Sastry.

Sitting:(left) G Gopalachari,(right)S. Satchidanandam.

Standing : (1st row) N. Vijayaraghavan, P. Sreeramacharlu (Private), M. Govindiah, B. Subrahmaniam (Private) B. Seshiah, T.K. Sreenivasa Ramanujam, M. Satyanarayana (Preliminary) D. Visweswara Srstry, K. Hanumantha Reddy. (2nd row) A.V. Sreenivasachari, G. Venugopala Row (Preliminary) K. Raghunadha Sastry, N. A. Narayana Rao, A. Padmanabhaih, T. B. Raghavachari, T.K. Guruswami Varma.



Sitting on Chairs : Sri C. Subrahmanya Sarma, 2) Sri K. Subrahmhnya Sastry, 3) Sri P. V Ramanuja Swamy (Principal), 4) Sri V. Prabhakara Sastry, 5) Sri J. Chenna Reddy, 6) Sri K. Ramaiah.

Sitting on Floor : S. Subba Reddy, V. Suryanarayana Murthy, 3) A. Venkatarama Reddy, 4) K. Sankara Prasad, 5) A. P Venkataseshacharya, 6) M. Krishnama Naidu.

Standing : (1st row) 1) T. K. Guruswami Varma, 2) N. Vijaya Raghavan, 3) B. Seshaih, 4) P. B. A. Krishnamacharya, 5) A. Vyaseswara Sastry, 6) G. Sreerama Murty, 7) S Sachidanandam, 8) G. Rajagopalacharya, 9) R. Subba Rama Raju, 10) Y. Madhava Rao, 11) B.Subrahmanyam.

Standing : (2nd row) K. N. Rao, 2) M. Govindayya, 3) K. R. Sastry, 4) P. Seshagiri Rao, 5) T. Kodanda Ramayya, 6) G. Gangi Reddy, 7) T. V. Nadan, 8) K. Ramulu, 9) Nasar M. 10) L. Sambasiva Reddy.

Standing : (3rd row) K.V.S.R. Krishnayya, 2) S. Veerabrahmam Naidu, 3) A. Narasimhayya, 4) D. Visweswara Sastry, 5) R. B. V. N. Acharya, 6) N.A. Narayana Rao, 7) S. Buchi Raju, 8) T. Denadayalu Naidu, 9) B. G. Lakshmana Raju, 10) R. Seshadri.

చూ. పుట. 127 ఫోటో. సంస్కృత కళాశాల - తిరుపతి 9-3-1945
మరియు పు. 1, 5, 8, 12.

# ప్రజ్ఞా ప్రభాకరము

—కొత్త రామకోటయ్య

( గత సంచిక తరువాయి )

7-2-1978 సాయంకాలము ఆరాధన సమావేశములో జరిగిన యోగ విశేషములు:-

మధ్యాహ్నము శ్రీ కొత్తపల్లి వెంకటరాజుగారు, చౌదరిగారు, శ్రీ ఎ.పి. శర్మగారూ మాట్లాడిన విషయములు. శర్మగారి యారోగ్య మిటీవల సంతగా బాగాలేదు. ఆయాసముగా నుండుటవలన మాత్రలు వాడుచుండిరి. అందువలన రొమ్ము భాగము నొప్పి వచ్చుచుండెను. అప్పుడప్పుడు కాలేజీకి వెళ్ళుటకు ఓపిక లేక శలవు పెట్టవలసివచ్చుచుండెను. రోజూ ప్రార్థనకు వచ్చేవారు వస్తున్నారు; వారి వారి బాధలు ప్రార్థనలో తొలగిపోతున్నాయి; వారెంతో తృప్తితో వెళ్ళిపోవుచున్నారు. కాని శర్మగారు బాధపడుచూనేయున్నారు. ఇది ఏమిటన్న ప్రశ్న తరచు వచ్చుచునే యున్నది. ఈ ప్రశ్నకు సమాధానము-

"నేను దగ్గుతో ఇదివరకు ఇంకా చాలా బాధపడెడివాడను. మందులేమీ సాయము చేయలేకపోయినవి. శ్రీ స్వామీజీగారు మొదట మందిచ్చిరి. ఆ విధాన మేమీ సాయం చేయలేదు. కాబట్టి వారు తరువాత మందీయలేదు. ''నీకీ బాధ తప్పక తగ్గిపోవును'' అని చెప్పేవారు. అలాగుననే మాష్టరు సి. వి. వి. గారి ప్రార్థనను మా ఇంటివద్ద చేసికొనుట ప్రారంభించగనే ఆ బాధలన్నీ క్రమంగా తగ్గిపోయినవి. మామూలు మంచి ఆరోగ్యము లభించినది. ఆ వ్యాధి వున్న గురుతు కూడ ఏమీ లేకుండ రెండు సంవత్సరముల కాలము అంతా చక్కగా నడచినది. ఇది మరపురాని అనుభవము. ఈ యోగసాధనవలన మాత్రమే మనకు ఇట్టి మంచి ఆరోగ్యము లభింపగలదని నా విశ్వాసము. అయినప్పటికిని నేను మరల ఈ దగ్గు ఆయాసములతో కొన్ని నెలలుగా బాధపడవలసివస్తూ

ఉన్నది. ప్రార్థన చేసుకొంటున్నాము. ఏదో కొంత తాత్కాలికమైన ఉపశాంతి కనిపించుతుంది. అయినా బాధపడవలసివచ్చుచునే యున్నది. అదే సమయములో ఇచ్చట యోగ సాధనలు వరుసగా జరుగుచునే యున్నవి. ఏవేవో బాధలతో యోగమిత్రులు ఇచ్చటకు వస్తున్నారు. వారికొరకై అందరము కలసి ప్రార్థనలు చేసికొంటున్నాము. ఆ వచ్చిన వారి బాధలు తొలగిపోయి వారు సుఖముగా తిరిగి వెళ్ళుచున్నారు. కనుక నాకు ఈ యోగమునందు గల భక్తి విశ్వాసములు ఏమాత్రము సడలలేదు. ఆ భావము కుదురుగనే యున్నది. బాధ వచ్చుచునే యున్నది. ఈ బాధ తొలగుటకు సరియగు మార్గమును వెదకుచున్నాము" అని శ్రీ శర్మగారు చెప్పిరి.

వారు చెప్పిన సమాధానముకంటే చెప్పగల విశేషము ఇంకేమీ కనుపించటము లేదు. ఎందువలన అనగా, మనలో ఎవరికిన్ని పూర్ణమగు ప్రాణశక్తి లభించుట లేదు. పూర్ణమైన ఆరోగ్యము మనలో ఎవరికీ ఇంకా అందలేదు. నిండైన జ్ఞానము, నిండైన ప్రాణము మనకు అనుగ్రహించవలసినదిగా మాష్టరు గారిని మనము రోజూ ప్రార్థన చేయుచున్నాము. అది లభించుట అనగా బ్రహ్మత్వము భూమికి దిగివచ్చుట అగును. అట్టి పరమ ప్రాప్యమగుసిద్ధికై మన మా యోగమును ఆశ్రయించి సాధన చేయుచున్నాము. సాయంకాలము ప్రార్థనకు యోగ సాధకులందరూ వచ్చిరి. యోగ విషయములను మాట్లాడుకొనుటలో అందరూ నిమగ్నులైరి. శ్రీ శాస్త్రిగారి యొక్క యోగానుభవము కూడ దాదాపు ఇదే మాదిరిగా ఉండినది. శ్రీవారు కుంభకోణములో స్వామివారిని దర్శించి మంచి ఆరోగ్యమును బడసి మద్రాసు వచ్చిరి. మద్రాసులో యోగ మిత్రులతో కలసి యోగ సాధన చేసిరి. ఎంతో ఉత్సాహము, యోగశక్తిని సంపాదించిరి. వారియొక్క అపారమగు దయవలన వారు తమ చుట్టునున్నవారి బాధలను పోగొట్టిరి. ఇలా కొంతకాలము వెలుగుబాటలో నడిచిన తరువాత "శ్రీ మాష్టరు గారు" తమ శరీరమును వదలిపెట్టిరి. ఆ సంఘటన శాస్త్రిగారిలో మరల పెద్ద మార్పును తెచ్చెను. ఈ యోగము స్థాపించిన మాష్టరు "C. V. V." గారే వెళ్ళిన తరువాత ఈ యోగ మేమిటి అను వెనుబాటు భావము పని చేసినది. వెలుగుబాటనుండి చీకటిలోనికి వెళ్ళినట్లు అయ్యెను. నిరుత్సాహముతో ఏమీ కదలిక లేకుండా కొంతకాలము గడచినది కృష్ణపక్షము తొలగిపోయి మరల శుక్లపక్షము వచ్చినది. చంద్రోదయమయినది.

N. R. B. V. (జోస్యులవారు)గారు మద్రాసువచ్చి నాడీ గ్రంథములు చదువుట, యోగ సమావేశములు ఏర్పాటుచేయుట ప్రారంభించిరి. ఆ మిషతో శ్రీ శాస్త్రిగారిలో మరల యోగోత్సాహము దీపించినది. వారి ఇల్లు ఒక యోగ కేంద్ర మయినది. ఆధివ్యాధులతో బాధపడు వారెందరో వారి ఇంటికి వచ్చి ప్రార్థనలో పాల్గొనేవారు. పాల్గొన్నవారి బాధలన్నీ వెంటనే తొలగిపోవు చుండెడివి. వారి ఇంట యోగాభ్యాసము చాలా కోలాహలముగా జరిగెడిది. శాస్త్రిగారెంతో ఉత్సాహముగా వెలిగిపోతూ ఉండెడివారు. కాని వారి శరీరము మాత్రము తరచుగా బాధలగు గురియగుచుండెడిది. ప్రార్థనకు వచ్చి యోగా భ్యాసము చేయునట్టి వారియొక్క బాధలయొక్క ఛాయలు శాస్త్రిగారి శరీరము మీద పనిచేయుచుండెడివి వచ్చిన రోగులు వారి రోగస్థితిని శ్రీ శాస్త్రిగారికి చెప్పవలసిన పని యుండెడిది కాదు. ఆ రోగియొక్క బాధలకు శాస్త్రిగారి శరీరమే ఒక అద్దమువలె పనిచేసెడిది. అది యొక ముచ్చటగాను ఉండెడిది. శ్రీ శాస్త్రిగారికి కొంచెము సంకటముగాను ఉండెడిది.

ఇదికాక ఏ కారణము తెలియకనే, అది ఎవరిబాధయో గుర్తింప వీలు కాకుండ ఉండగానే శ్రీ శాస్త్రిగారు ఒక్కొక్కప్పుడు బాధపడుచుండెడివారు. ఆ బాధ ఇట్టిట్టిదని తెలుప వీలుకాకుండ ఉండెడిది. దాని అర్థము (కారణము) చాలాకాలము జరిగిన తరువాతనే తెలిసెడిది. అది యొక వింత అనుభవము.

అయినప్పటికి శ్రీ శాస్త్రిగారెప్పుడూ తన శరీరారోగ్యము చాలా చక్కగా, దివ్యముగా ఉన్నది అన్న గట్టి కుదురుబాటైన వెలుగు భావముతోనే ఉండెడివారు. అది యెప్పుడు ఏమాత్రము సడలెడిది కాదు. మాష్టరుగారు మన శరీరము మీద ఏవేవో "ఎక్స్పెరిమెంట్సు'' చేయుచున్నారు, అది మన మంచికొరకే అనేవారు. వారి మాటయే మనకు వెలుగు బాట.

విశాఖపట్టణము 8-1-1978 నుండి గురుపూజలు అనంతరము వఱకు :-

శ్రీ పున్నయ్యగారికి కొలదిగా గుండెనొప్పి వచ్చుట వలన వారు విశాఖ పట్టణము వెళ్ళిరి. అక్కడ హాస్పిటలులో చేరి కాకాని ఉత్తరము వ్రాసిరి. అందు వలన నేను 8 వ తేదీకి విశాఖపట్టణము వెళ్ళి పున్నయ్య గారిని చూచితిని. వారు కులాసాగానే ఉన్నారు. డాక్టర్లు మాత్రము 8 వారములు పూర్తి విశ్రాంతి తీసు కొనుమని చెప్పినారుట. వారితో 9-10 తేదీలు గడపి, గురుపూజలకై 10 వ

తేదీ రాత్రి సింహాచలము వెళ్లితిని. 10వ తేదీ సాయంకాలము ప్రార్థనలో శ్రీ కష్ణ స్వామిగారు నేను అచ్చట హాజరుగా నున్న యోగ మిత్రులు కలసి సాధనలో పాల్గొంటిమి. మాష్టరు సి.వి.వి. గారిని గురించి, శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని గురించి, E.K.గారిగురించి యోగ గోష్ఠి జరిగినది. ఉదయం 6 గంటలకు ప్రార్థన సమావేశము ఏర్పాటు చేసిరి. సుమారు ఒక వెయ్యి మంది యోగమిత్రులు ప్రార్థనలో పాల్గొనిరి. వేయి మంది ఒకే గొంతుతో "మాష్టరు సి.వి.వి. నమస్కారం" మను దివ్యమంత్రమును ఉచ్చరించిరి. అలా ఉచ్చరించుట ఒక అనుభవము. ఆ ఉచ్చరించు శబ్దమును వినుట వేరొక మంచి అనుభవము. ఆ శబ్దమును లోపలకు గ్రహించుట అన్నది ఇంకా చాలా మంచి అనుభవము. ఈ యోగ మిత్రులు ఎన్నో వందల మంది అచట సమావేశమైరి. వారు ఎన్నో తీరుతైన ఆచారములు కలవారు. అలవాట్లు కలవారు. పలు రకములగు వృత్తులలో జీవితమును గడపువారు. అట్టివారందరూ ఒకచోట సమావేశమైరి. అందరి మనస్సులు మాష్టరు C.V.V. యందు లగ్నమయినవి. ఆలోచనలన్నీ అటువైపు మళ్ళినవి. అందరూ ఏకాగ్రమయిన చిత్తముతో ఏకగ్రీవమగు కంఠస్వరముతో మాష్టరు C.V.V. యొక్క నామము ఉచ్చారణము చేయుచూ కూర్చుండిరి. ఆ దృశ్యము చూచుటవలన కన్నుల ద్వారా మనస్సునకు ఎంతో ఊరట కలిగినది. నామోచ్చారణ శబ్దమును చెవుల ద్వారా వినుట వలన చిత్తము ప్రసన్నమగుట జరిగినది. ఆ శబ్దము లోపల ప్రవేశించుటవలన లోపల అంతరంగ మంతయు శాంతమయమయి హాయిని గొలిపినది. ఇట్టి యోగమిత్రుల సమావేశములు తరచుగా జరుగుట వలన అట్టి ప్రార్థనలలో పాల్గొన్నవారికి చిత్త శాంతి లభింప గలదు. అని ఈ అనుభవము చెప్పుచున్నది. ఆ వేయిమంది సాధకులు ఎంతో ప్రశాంతముగా కూరుచుండిరి నిశ్శబ్దముగా యోగసాధనలో కూర్చుండుట అన్నది ఒక మంచి అనుభవము. ఆ వెయ్యి మందిలో సర్వాంతర్యామిగా వర్తించే చైతన్యము ఒక్కటియే. అలాంటి ఒకే ఒక చైతన్యము యొక్క ప్రభావము వలన అచట చేరిన సాధకులందరూ తన్మయులై కదలక ఉండిపోయిరని తెలియుచున్నది. ఆ ప్రార్థన పూర్తియైన తరువాత E. K. మాష్టరుగారు ప్రసంగించిరి. అందు మాష్టరు సి.వి.వి. గారు లోకకల్యాణము కొఱకై అవతరించిన యోగ పురుషులు అనిన్నీ, వారు స్థాపించిన యోగమార్గము లోకము నంతటిని ఉద్ధరించుటకై ఏర్పాటు చేసిరనిన్నీ ఉపన్యసించిరి. (సశేషము)

# నాకు తోచిన మాట

—వేటూరి ఆంజనేయులు

*(మణిమంజరి ఆగస్టు 1983 సంచికలో ప్రచురింపబడిన 'నాకు తోచిన మాట' తరువాయి భాగము)*

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "రంగనాథరామాయణా"నికి పీఠిక తామే వ్రాయుదుమని వే॥ప్ర॥ గారికి 28-9-1941 (మ॥మం॥ ఫిబ్రవరి 1! తేదీన వ్రాశారు చివరకు తేలినది, పింగళి లక్ష్మీకాంతముగారి అసమగ్ర పీఠికకు ఆయన జోడించిన 'అనుబంధ పీఠిక'. ఈ 'అనుబంధ పీఠిక' వ్యంగ్యారోపణల తోను, సులోచనావృత్తాంతాన్ని పరిష్కర్త అనుబంధములో చేర్చుటను విమర్శించుటతోను, కవుల పక్షపాతమును నిరూపించుటతోను, రామాయణమును, ప్రాంతీయ ఆర్యానార్య దృష్టితో సమీక్షించుటతోను, వాల్మీకి రామాయణములోని కొన్ని సంశయాస్పదముగా తమకు తోచిన విషయముల నెత్తుటలోను సాగినది.

శ్రీ కట్టమంచివారి అభిప్రాయానుసారము, రామాయణ రచయితయైన గోన-బుద్ధుడు, సులోచనా - జంబుమాలి వృత్తాంత రచనలలోను రామలింగ ప్రతిష్ఠ విషయమున, ద్రావిడ సంస్కృతి యొక్క విలక్షణతను నిరూపించు సంకల్పముతో వీటిని సృష్టించెనని తేలుచున్నది కాబట్టి, కట్టమంచివారి రచనలు గోన- బుద్ధునివేగాని, కాలక్రమమున ఇతరులు చేసిన చేర్పులు (interpola-tions) కావని తలంచిరనుట స్పష్టము.

కృత్యవతరణిక, రచయిత, కృతిభర్తల కావ్యరచనా లక్ష్యాన్ని ఏమాత్రమైనా వివరించినచో శ్రీ కట్టమంచి వారి యూహ ఎంతవరకు సమంజసమో తెలియనగును. కవి, తానొక అనూచానమై, సుప్రతిష్ఠితమైన రచనను చేయ దలచితినన్న పట్టున యీ క్రింది విధముగా చెప్పుకొన్నాడు:

''మా దేవుఁ గమలాక్షు మమ్మేలు వేల్పు
నాది నారాయణు నఖిల లోకేశు
భావించి, కీర్తించి, ప్రార్థించి మ్రొక్కి-
సేవించి, యభిమతసిద్ధిఁ బాటించి
హారకర్పూర నీహార గోక్షీర
తారకాకృతి శారదాదేవిఁ గొలిచి
చారు రామాయణ చంద్రాబ్ధి యగుచు
వారక విలసిల్లు వాల్మీకిఁ దెలిచి
భారతమంజరీ పారిజాతంబు
సారమానసుఁ బరాశరసూను దలఁచి
ఘతని తనూభవు నా శుకయోగి
నతి భక్తి యుక్తిమై నభినుతిసేసి,
యే కథ సెప్పిన నెల్ల సజ్జనులు
సేకొని కీర్తనల్ సేయుచునుందు?
రేకథ సెప్పిన నిహ పరోన్నతులు
ప్రాకటంబుగఁ బేర్చి ఫలియించునుర్వి?
నే కథ సెప్పిన నీప్సితార్థములు
గైకొని, పుణ్యముల్ గడఁగి కావించు?
నను విచారములు నా యంతరంగమున
గానకొని కృతిసేయఁ గోరుచున్నంత...
(పుట 2- రం॥రా॥)

ఈ పై పంక్తులవలన రామాయణ రచయిత సంప్రదాయ సరణి ''నే కథ సెప్పిన నీప్సితార్థములు గైకొని పుణ్యముల్ గడఁగి కావించు'' నను దృక్పథముతో నీ కృతిని గావించెననుట స్పష్టము గదా! అదియును గాక, కృతిభర్తయగు విఠలుడు :

''రామ కథా సుధా రసరక్తుడగుచు
నా మహాసభలోన నందఱఁ జూచి

'రమణమైఁ దెనుగున రామాయణంబు
క్రమమొప్పఁజెప్పెడు ఘన కావ్య శక్తి
గలకవులెవ్వరు గల రుర్వి?' ''

యని ప్రశ్నించుటను బట్టి, రామాయణ రచయితకు, కృతిపతికి కూడ, వాల్మీకి రామాయణమును ''క్రమమొప్ప" తెనుగున ననువదించుటే లక్ష్యము, అభిమతము నని తెలియుచున్నది.

ఇట్టి సాంప్రదాయికమై, అలౌకికమైన మనోవృత్తిగల రచయిత సులోచనా వృత్తాంతాన్ని "ఆర్యులైన మీకు సీతమ్మ యున్నది; ద్రావిడులైన మాకు నామెతో నీఁడుజోఁడగు సులోచన యున్న''దన్నట్లు గాని, రామలింగ ప్రతిష్ఠ పట్టున: "మీకు కాశి, మాకు రామేశ్వరము. మా ఈశ్వరుడు మీ యవతార దైవముచే బ్రతిష్ఠింపబడినవాడు'' అని "దాక్షిణాత్యస్పర్థ"ను వెల్లడించునట్లు గాని ప్రవర్తింపడు, రామాయణ కావ్యరచన కుద్యమింపడు. మరియు, కాండాంతమున రచించిన యీ క్రింది పంక్తులు కూడ వాల్మీకి రామాయణము సంప్రదాయానుగుణముగా రంగనాథ రామాయణ రూపమున అనువదింపబడెనను అభిప్రాయమును బలపరుచుచున్నవి.

''నారూఢినార్షేయమై, యాది కావ్య
మై, రసికానందమై, యెల్లనాఁడు
నివ్వసుమతినొప్పు నీ పుణ్య చరిత
మెవ్వరు సదివిన, నెవ్వరు వినిన,
సామాది బహువేదచయధామ రామ
నామ చింతామణి నవ్యభోగములు
పరహితాచారముల్, ప్రభు విచారములు
పరిపూర్ణశక్తులు, ప్రకట రాజ్యములు
నిర్మల కీర్తులు, నిత్యసౌఖ్యములు
ధర్మైకనిష్ఠలు, దానాభిరతులు
... ... ... ... బాపక్షయంబు
సతతంబు దేవతా సంతర్పణంబు
బితృగణ తృప్తియుఁ బెంపొందుచుండు

నిది మోక్షసాధనం, బిది పాపహరము
నిది దివ్య, మిది భవ్య, మిదియు శ్రీకరము
రమణీయ లీల నీ రామాయణంబుఁ
గ్రమమొప్ప (బూజింపఁగల్గు బుణ్యములు.''

ఇక సులోచనాది వృత్తాంతములు వాల్మీకి రామాయణములో లేనివెట్లు రంగనాథ రామాయణమందు చేరినవన్న ప్రశ్నకు సమాధానము కుదురవలెను. ఈ అధిక భాగములను యితరులు చేర్చియుందురు. సులోచనా వృత్తాంతమును పరిష్కర్తలు రెండనుబంధములలోను చూపియున్నారు. మొదటి అనుబంధములో నున్న విషయములు "రంగనాథ రామాయణ వ్రాతప్రతులందుఁ గానరాక పూర్వముద్రణము నందు మాత్రము గానవచ్చు నధిక భాగము''లని నిర్వచించినారు. రెండవ యనుబంధములోని అధిక భాగములను గురించి పరిష్కర్తలు: ''రంగనాథ రామాయణ పూర్వముద్రణమునఁ గానరాక, వ్రాతప్రతులలో లభించిన యధిక భాగములును, పూర్వముద్రణమునఁ గల భాగములఁ గొన్నింటికి వ్రాతప్రతులయందుఁ గానవచ్చిన రచనాంతరములును'' అని విశదీకరించిరి.

శ్రీ శాస్త్రిగారు, కట్టమంచి వారికి 1941 నవంబరు 19వ తేదీన యిచ్చిన ప్రత్యుత్తరములో మూడు సాధనములను బట్టి ప్రధాన పాఠములు నిర్ణయింపబడినవనిరి. ఆ మూడు సాధనము లేవనగా: (i) వ్రాతప్రతులలో పెక్కింటిలో నుండుట; (ii) రచన బాగుగా నుండుట; (iii) సంస్కృత, భాస్కర రామాయణములతోడి సంగతి.

పీటికితోడు, కృత్యవతరణికలోను, కాండాంతమున, వాల్మీకి కృత సంస్కృత రామాయణాన్ని తెల్గుసేయుపట్టున, కృతికర్త, కృతిపతుల లక్ష్యాభీష్టములు, తదితర వ్యత్యాసములు గూడ గ్రంథ పరిష్కరణోద్యోగమున అధిక పాఠముల చేర్పులకు, తీసివేతలకు పరికరములుగా పాటించతగునేమో! వీటిని బట్టి చూడగా ఆనుపూర్వికమై, సంప్రదాయపరమై, సంస్కృత రామాయణానికి తెల్గుచేతగా ''నిహపరోన్నతులు ప్రాకటంబుగఁ జేర్చి ఫలియించు నుర్వి'' (రం॥ రా॥ పుట. 2) నను లక్ష్యశుద్ధితో, సాధించిన రామాయణ రచనలో వృత్తాంతేతరములను రచయిత జొనుపు టసంగతము. కృత్యవతరణిక ఎత్తుగడయే రచ

యితకు గల పరతత్వ పరాయణతను తెల్పుతూ, అట్టి తత్వజ్ఞుడు సంకుచిత దృష్టితో ఆర్యానార్య విభేదములకు, ప్రాంతీయాభిమానములకు ప్రాధాన్యమిచ్చి వాని కనుగుణమైన వృత్తాంతములను కల్పించి చేర్చుననుట నిర్హేతుకమేమో!

సులోచనా వృత్తాంతము ననుబంధములలో నేకారణముచేత చేర్చిరని శ్రీ రెడ్డిగారు వారి లేఖలో ప్రశ్నింపగా శ్రీ వే॥ ప॥ గారిచ్చిన సమాధాన మీ దిగువది :

*"సులోచన కథ :*

తాళపత్ర ప్రతులన్నింట భిన్న భిన్న విధములతో నున్నది. ఇప్పుడు ప్రధాన పాఠముగా కయికొన్నది అధిక ప్రతులతో సంవాదము కలది. కొంత మంచి రచన గలదిగాన - **పూర్వముద్రణమున** నున్నది. ఇక్కడి వ్రాత ప్రతులలో లేదు. *రచనలో భాషా లక్షణాదికము పూర్వోత్తర రచనతో సరిపోలనిది."*

(మణిమంజరి - ఫిబ్రవరి 1983 సంచిక, పుట. 36. వే॥ ప్ర॥ గారి 1941 నవంబరు 19 వ తేదీ లేఖ నుండి.)

శ్రీ రెడ్డిగారికి భిన్నాభిప్రాయము కలదని శ్రీ వే॥ ప్ర॥ గారెరుగరైరి. వారి నిశ్చితాభిప్రాయము తెలిసి యున్నచో, ప్రభాకరులు వారి "ఆత్మాదేశము"ను మార్చుకొని యుండరుగాని, "భాషా లక్షణాదికములలో'' గల వ్యత్యాస ములను నిరూపించి యుండెడివారేమో ! శ్రీ రెడ్డిగారి అనుబంధ పీఠిక రచన 1942 ఫిబ్రవరి, ఒకటవ తేదీది. అంతకు రెండు నెలలకు పూర్వమే వే॥ ప్ర॥ గారు వారి 1941 నవంబరు 19 వ తేదీ లేఖలో సులోచన, రామలింగ ప్రతిష్ఠ లను గురించి ప్రధాన పాఠములుగా వారెన్నిక చేయుటలో ఏర్పరచుకొన్న నిబంధనలను గూర్చి విపులమైన లేఖ వ్రాసిరి. సులోచనావృత్తాంత విషయములో ''రచనలో భాషా లక్షణాదికము పూర్వోత్తర రచనలతో సరిపోలనిదని'' దానిని ఒకటవ అనుబంధములో చేర్చుటకు కారణము తెల్పిరి గదా!

శ్రీ రెడ్డిగారు మొదటి అనుబంధములో చేర్చబడిన సులోచన కథ ''శైలిలో శుద్ధ రచన మట్లున్న"దని తమ అభిప్రాయము గనుక, దానిని

పరిష్కర్తలు మూలములో నెందుకు చేర్చలేదన్న తమ ప్రశ్నకిచ్చిన కారణాన్ని వెలిబుచ్చకుండా వారి (శ్రీ రెడ్డిగారి) అభిప్రాయపరంగా ప్రశ్న పరంపరలతో తమ అనుబంధ పీఠికలో వెక్కసపడిరి.

ఈ పట్టున పాఠకులకు సహజంగా స్ఫురించే ప్రశ్న యొకటున్నది. అది యేమన, 'సులోచన' కథ శైలి విషయంలో "భాషా లక్షణాదికము" పూర్వోత్తర రచనలో వ్యత్యాసము కలదన్న వే॥ ప్ర॥ గారి సిద్ధాంతము ప్రామాణికమా, రెడ్డిగారి అభిప్రాయము "శైలిలో బుద్ధరచన మట్లున్న" దన్నది ప్రామాణికమా? శ్రీ కట్టమంచివారు తమ అభిప్రాయమును వెలిబుచ్చి, శ్రీ వే॥ప్ర॥ గారికి వారి పరిశీలనాబద్ధమైన నిరూపణను ప్రచురించే ఏర్పాటు చేసినట్లయితే బాగుండేది.

మొదటి అనుబంధములోని సులోచన కథ 165 పంక్తులు గలది (రం॥రా॥ పుటలు 680-685). రంగనాథ రామాయణములోని యొక విశిష్ట లక్షణము ప్రవాహ వేగముతో, అడ్డమాకలు లేక, కథావిధానము వడివడిగా సాగిపోవుట. వాల్మీకి రామాయణాని కనుగుణ్యమైన, రాముడు మూర్ఛిల్లిన పట్టున లక్ష్మణుడు అర్థహీనుని నిరర్థకతను గూర్చి యుపన్యసించుట; సీత, రాముడు నాగపాశబద్ధుడైన పట్టున విలపించుచు లాక్షణికు లామెకుగల సాముద్రిక లక్షణాలనుబట్టి ఐదువై యుందువని చెప్పుటను గుర్తుకు తెచ్చుకొనుట కథా గమనమునకు అడ్డంకులుగా స్ఫురించుచున్నపుడు, 165 పంక్తులను ఆవరించిన సులోచన కథ మూలములో చేర్చినచో కథా క్రమము ఎంతగా అరికట్టబడునో చెప్పనక్కర లేదు. ఈ వృత్తాంతములో రావణుడు, ఇంద్రజిత్తు కళేబరమును సులోచన తెప్పింపుమనగా తన అశక్తతను తెల్పుట, అప్పుడామె తన మామ (రావణుడు) యనుమతితో రాఘవుని వద్దకు వెళ్ళి, తన భర్త మృతదేహము తనకిప్పించమని యడుగుట; సుగ్రీవుడు సులోచనతో పతివ్రతవైతివేని భర్త మృతదేహముచేత మాట్లాడించుమనుట; ఆమె యట్లు చేయుట; తదుపరి భర్త కళేబరమును తీసుకొని పోయి, మామ అనుజ్ఞను పొంది, ఆమె సహగమనము చేయుట వర్ణింపబడినవి. రామాయణపు శైలికి, మొదటి అనుబంధములో చేర్చబడిన సులోచనావృత్తాంతపు శైలికి గల తారతమ్యము ఏపాటి ఆంధ్ర భాషా పరిచయములేని నా బోటివానికే కన్పడుచున్నది. రంగనాథ రామాయణపు శైలి ప్రౌఢము; సులోచన కథా

భాగపు శైలి సామాన్యము. పండితులకు అనేక ఇతర రీతుల వ్యత్యాసములు కన్పడుట సహజమే కదా !

ఇక రెండవ అనుబంధములో చేర్చబడిన సులోచన కథ యొకటి వెట్టి తలలు వేసిన రచన - 1431 పంక్తులు కలది. సులోచనకు మండోదరి పాతివ్రత్య మహిమను గురించి ఐతిహ్యములు చెప్పును - వీటితో సులోచనా వృత్తాంతము, రామాయణ కథను ప్రక్కకు నెట్టినట్లైనది. బమ్మెర పోతన సీసములను; ఐతిహ్యములలో శ్రీనాథుని గుణనిధి, రామలింగని నిగమ శర్మలను గుర్తుకు తెచ్చుపట్టులు పాతివ్రత్య నిరూపణ కుపయోగింపబడినవి. పోతన సీసపద్యాను కరణము పేలవముగా క్రింద వివరించిన రీతిని సాగినది :

"పతియు దూరంబైన బాంధవులేల
యతనిఁ బూజింపని యాచేతులేల
యతనికి మ్రొక్కని యా శిరంబేల
యతనిఁ గన్గొనని యా కన్నులేల
యతని మాటలు నొలయని వీనులేల
యతని వర్ణింపని యా జిహ్వయేల
యతనిపైఁదగులని యా మనంబేల
యతనిపైఁబాడని యా పాట లేల
యతనిపై నిలుపని యా బుద్ధియేల
యతని నుతింపని యా దినంబేల
యతని ఁజింతింపని యా చదువేల
పతి కౌఁగిలించని పణతి కాయంబు
పవనకుంభిత చర్మభస్త్రిగాకేమి
సవినయంబుగ సారసల్లాపములను
అమరంగఁబతితోడ నాడని నోరు
ఢమ ఢమ ధ్వనితోడి ఢక్కగాతేమి ?
వరుసేవ సేయని వీరకరాబ్జంబు
తరసాస్థి నిర్మిత దర్విగాకేమి ?

పురుష నీక్షింపని పొలఁతి నేత్రములు
ధర తను కుడ్య రంధ్రములుగాకేమి ?''
(రం॥రా॥ పుట - 788)

మరియొక పాఠాంతరము 133 పంక్తులు గలది, 824-828 పుటలలో గాననగును. ప్రభాకరుఁలీ సులోచన కథ ''తాళప్రతులన్నింట భిన్న భిన్న విధములతో నున్నది.'' యన్న విషయమును సాభిప్రాయంగాను, నిష్పాక్షికంగాను సమాలోచించిన వారెవరైన, యీ వివిధ పోకడలలో నున్న వృత్తాంతాన్ని అనుబంధములో జేర్చుటలోని సామంజస్యమును గుర్తింతురేగాని, మూలమునందు జేర్చక విస్మరింపబడినదని విమర్శింపరు.

ఇక రామలింగ ప్రతిష్ఠ విషయములో పరిష్కర్తలు దీని నెందు కనుబంధములో చేర్చితిరను శ్రీ రెడ్డిగారి ప్రశ్నకు సమాధానమిస్తూ యీ క్రింది విధముగా వ్రాసిరి:

''మూలములో లేనిది కొన్ని వ్రాత ప్రతులలో భిన్న పాఠములతో నున్నది......దాని రచన పూర్వోత్తర రచనలతో సరిపడుచునే యున్నది గాని ప్రక్షిప్తమనదగినట్లు లేదు అమూలకములు (సంస్కృత గ్రంథమున లేనివి) ఎన్నో కథా భాగములు మన రంగనాథ రామాయణమున నిప్పుడు చేరియే యున్నవి. కాన, యీ భాగము అమూలకము అన్న కారణమున పరిత్యజించినను అది 1వ అనుబంధమున జేరవలసినదే గాని, ఇప్పుడున్నట్లు 2వ అనుబంధమున ఉండగూడదు. మీ ఆక్షేపము సరియయినది. అనారోగ్యాది కారణములచే యుద్ధకాండ తుదిపట్టు ముద్రణ భారము నేను ఇతరుల మీద విడనాడితినని నేనిప్పుడు తప్పికొనుట తప్పుకాన తత్ప్రాయశ్చిత్తము నేను పొందుచున్నాను. ఇట్లు చేయుదును.

1. రామలింగ ప్రతిష్ఠ కథా భాగము మూలముతో చేర్చి మరల ఆ భాగము మాత్రమే ముద్రింతును - దాని వ్యయము నేను భరింతును.

2. దానిని రెండవ అనుబంధము నుండి తొలగింతును. ఆ అనుబంధము ముద్రణ భాగపు మార్పు వ్యయమును గూడ నేను భరింతును. ఈ విధ

ముగా గ్రంథ ముద్రణపు మార్పు వెంటనే చేయవలసినదిగా మీ సమ్మతి రాగానే శ్రీ సుబ్బరామయ్యగారికి వ్రాసి యట్లు చేయింతును.''

(మణిమంజరి, ఫిబ్రవరి 1983 పుట 36)

శ్రీ వే॥ ప్ర॥ గారు పైన వ్రాసిన తీరునుబట్టి రంగనాథ రామాయణ పరిష్కరణ వారికి భారకారణమైనట్లు, దానినుంచి బయటపడవలెనను వారి కోరిక స్ఫురించు చున్నవి. వారు రెడ్డిగారికి వ్రాసిన పై సమాధానమువలన యీ క్రింది విషయ ములు విశదములు.

— ప్రభాకరులకు అమూలకములైన కథా భాగాలను, మంచి రచన కలవైనా మూలముతో చేర్చుట సమ్మతము కాదని.

— అట్టి రచనలను రెండవ యనుబంధములో గాక మొదటి అనుబంధములో చేర్చతగునని వారి నిర్ణయమని;

— రామలింగ ప్రతిష్ఠ మూలములో చేర్చుటకు వారి మనస్సంగీకరింపక పోయినా, అమూలకములైన కొన్ని కథా భాగములు రంగనాథ రామా యణ మందుండుటచేత, శ్రీ రెడ్డిగారి అభీష్టమును నెరవేర్చుటకై వారే సరిపుచ్చుకొని మూలముతో చేర్చుటకు సమాధానపడిరని.

రంగనాథ రామాయణ పరిష్కరణోద్యోగము శ్రీ వే॥ ప్ర॥ గారి కెంత ఇష్టమైనా, దాని కొరకై వారెంత స్వచ్ఛంద సేవ చేసినా, అందు మూలమున వారికి కల్గినది వెక్కస మొక్కటే.

# యోగ విషయము : ఉపన్యాసము

—వేటూరి ప్రభాకరశాస్త్రి

*[7-4-47 నాటి సాయంత్రము ప్రార్థనానంతరము గురుదేవులు ప్రసంగించిన విషయమిది. ప్రసంగపాఠమును వ్రాసి పంపినవారు యోగ మిత్రులు సింగరాజు సచ్చిదానందంగారు. అందుకొని, భద్రపరచి మా కిందించినవారు యోగ మిత్రులు శ్రీ కొత్త వెంకటేశ్వరరావుగారు. వారికి మా కృతజ్ఞతలు. —సం॥]*

కొన్నాళ్ళేదో నిశ్శబ్దంగానూ, కొన్నాళ్ళు బురుసు వెలిగినట్లు ఏవేవో భావాలు రేగి విడవక మాట్లాడవలసినట్లుగానూ చేస్తూంటుంది నాలో ఏదో ప్రజ్ఞ. ఏది ఎట్లా ఉన్నా ఆ అనంతం నెమ్మదిగా ఉన్నట్లు తెలిస్తే చాలు. శ్రీ లక్ష్మీ నారాయణగారి ఉత్తరానికి బదులు వ్రాద్దామనుకొంటే నాలోపలనంతా శూన్యంగా ఉన్నట్లు అమావాస్యాభిముఖంగా ఉంది. నేను మాస్టరుగారి Birth day నాటికి కుంభకోణము వెళ్ళడమా? లేక 14 వ తేదీ నాటికే వెళ్ళడమా? అనేది ఇంకా తేలలేదు.

ఈ యోగంలో చేరిన తర్వాత 10 ఏండ్లకుగాని ఈ వ్యక్తే 'ఆరిజన్' అనే నిర్ణయం నాకు కలుగదయ్యెను. ఏది సృష్టికి మూలమో అది 'CVV' అవునో కాదో అనే సందేహంతో కొట్టుకాడుతూ ఉండేవాణ్ణి. ఈ పది యేండ్ల తర్వాత నాకు కల్గిన ఇక్కట్టు ప్రత్యేకంగా వివరిస్తాను. అప్పటి నా అనుభవ ములు చాలా విచిత్రమయినవి. అప్పటినుండే నాకు నాలోనుండి ఉద్బోధమనే ఊట ఊరసాగినది. ఏదైనా ప్రశ్నకు సమాధానము రావడము మొదలుపెట్టినది. ఎక్కడనుండి సమాధానమూ, ఉద్బోధమూ ఉత్పత్తి యగుచున్నదో అక్కడికి వెళ్ళి చూడకపోయినా, అక్కడనుండి సమాధానము రావడమును గుర్తించ గల్గినాను. ఆ అనుభవము ప్రారంభమైననాడు నా శరీరంలో చెలరేగిన భావాలు అంతా ఇంతా కాదు. ఆనాడు నా శరీరమంతా తేళ్ళు ఒలిచినట్లయినది ఒళ్లంతా

అదరిపోవడం, చెమటలు దిగ గారడం, ఒక రాత్రంతా మరణయాతన పడ్డట్లయింది నాకు.

అప్పుడు నాలో మూడు శక్తులున్నాయని గుర్తించగల్గినాను. బుద్ధిలో నుండి సమాధానము వస్తూన్నదనీ, మనస్సు సందేహపడుతూన్నదనీ, నా జీవాత్మ వీటి నన్నిటినీ రిసీవ్ చేసుకోగల్గుతూందనీ తెలుసుకోగల్గినాను. నాలో ప్రశ్న, దానికి సమాధానము, రెంటినీ గ్రహించడం అనే మూడు విభాగములు తోచినవి.

మాస్టరంటే ఆయనా ఒక వ్యక్తే. ఆయనకూ కోపం మొదలగు కొన్ని వీక్నెస్ లుండినవి ఒకప్పుడొక డిసైపులును చెంపకాయ వేసినారు. అక్కడితో అతడి రోగం కుదిరిందన్నారు. నాకూ అట్లాగే కోపం వస్తుంది కాని, ఆయనకు చెల్లినట్లుగా మనకు చెల్లదు. అయినా అట్టివారిని ఈశ్వరునిగా భావించడం ఎట్లాగా అనే సందేహం నన్ను బాధించింది, బాధించింది. నేనెఱిగినంతవఱకు బాహ్య మానవ లోకంలో లోకతంత్రంలో కొట్టుకాడుతూ కూడా, తన్ను తాను లోనికి గుర్తించుకొంటూ, తన లోట్లను దిద్దుకొంటూ మహోన్నతంగా జ్వలిస్తూ ఉన్న దివ్య వ్యక్తిగా గాంధిగారు కనబడుచున్నారు. వారూ ఇంకా పరతత్త్వమును చూడనేలేదంటూ చిక్కులతో ఉక్కిరిబిక్కిరి ఔతూ ఈశ్వరనిశ్చయం వీడకుండా నిరంతరాన్వేషణ జరుపుచున్నారు

ఎక్కడైనా పరతత్త్వము చూడవలెనని నిరంతరము కొట్టుకుంటూన్న వారెవరైనా వుంటే వారికి ఆ తత్త్వము కనుపించవచ్చు. అట్లా కనుపించే వ్యక్తే శ్రీ మాస్టరుగారని వారి నమ్మకము. ఒకనాడు వారు 'మీరికమీద నన్ను పోలి ఉండేటట్లు యత్నించండి' అనిరి. అప్పుడు నాకిట్లా తోచింది. వీరికి వీక్నెస్ లున్నవి గదా! ఈయన యిట్లా అంటున్నారేమా? అని. మఱొక సందర్భంలో నన్ను గూర్చి యిట్లా అన్నారు : "నన్ను డైరెక్టుగా తెలుసుకునేటంతవఱకూ నన్నుగూర్చి ప్రాపగండా చేయడం వద్దు" అని. కాబట్టి వారిని గూర్చి నేనిప్పుడు మాట్లాడడం విరుద్ధంగా ఉంది కదూ!" దీనికి సమాధానం ఇప్పుడే లోపలినుండి "నన్ను తెలుసుకుంటేనేగాని" అన్న భావానికి ఆ తర్వాత 10 ఏండ్లకు వారే బ్రహ్మమని గుర్తించాను గదా! ఇప్పుడిదెందుకు విరుద్ధం అవుతుంది? ఎంతెంత

వారిని తెలుసుకుంటున్నానో అంతంతే వారిని గూర్చి మాట్లాడుచున్నాను. వారే 'బ్రహ్మ' మనే నా నిశ్చయం, ఎవరికీ చలింపజేయరానిది. ఇక భయమేమి?

తర్వాత తర్వాత నే నర్థం చేసుకున్నదేమంటే, వారితో నేను భ్రమరకీట న్యాయంగా ఉండవలెనని. దానికర్థం ఆ Picture గానే కావాలనే ఫీలింగ్. అంటే ఆ Picture కనుపడి ఈ పిక్చరు కనుపడకుండా పోవాలనని కాదు. ఒక దృష్టితో చూస్తే ఆ పిక్చరు, ఇంకొక దృష్టితో చూస్తే ఈ పిక్చరూ చీట్ల పేకలోని బొమ్మ మాదిరిగా ఉండాలని దాని కర్థము. ఆ అర్థము తెలిసిన తర్వాతనే పాలూ, పంచదారవలె వారూ, నేనూ కలసిపోవాలనని మరీ నిశ్చయించుకోవడము జరిగినది. ఈ భావం శ్లేషకవితా రచన, శ్లేష చిత్ర రచనలను పోలినది.

వీటికన్నింటికీ యీ ఆక్టివిటీని కల్గించే శక్తి ఆ మూడక్షరాల (CVV) స్మరణమే. ఆ పేరును తలచుకొనేటప్పటికే ఆ శక్తి ఆ తలచుకొనేవారి డిఫెక్టును తొలగిస్తూ రెక్టిఫై చేస్తూఉన్నది. అంతేకాకుండా వారి ద్వారా ఎదుటివారినికూడా రెక్టిఫై చేస్తుంది. ఆ Capacity అనేది వర్కు చేయకపోతే మీరే కాదు, నేను కూడా పై నిశ్చయంలో ఉండడం తటస్థించదు. ఇంతటి దివ్య తంత్రమునకూ 'కీ' తాళపుచెవి C.V.V. అక్షరత్రయము. ఇది అదే కాకపోతే ఇంత పని చేయజాలదు.

మాస్టరంటే ఏమిటి? ఆ నామస్మరణముతోనే యిట్లా ఆక్షన్ జరగడానికి కారణ మేమిటని, ఎక్కడైనా ఆక్షన్ జరగడానికి కారణమేమిటని యోచనచేస్తే చెట్టు మొలుస్తూందనుకో. దాని కూకటి వేరేది? విత్తనంలోనుండి మొట్టమొదట భూమిలోకి దిగే వేరే కూకటి వేరు. మొదట క్రియేషన్ స్టార్టయిందంటే మట్టిలో నుండి చెట్టుకూ, చెట్టులో నుండి జంతువునకూ, జంతువు నుండి మానవునకూ మారుతూ స్ప, ధాతు, వృక్ష, జంతు, మానవ వర్గములుగా డెవలప్ అవుతూ వచ్చినవి. ఈ ప్రకారంగా జీవాణువులు తమ వాంఛలను సాధించుకుంటూ డెవలప్ అవుతున్నవి. ఈలాధాతువర్గానికి యింకా పూర్వానికిపోతే నీళ్ళు, తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచభూతాలలో తక్కినవి వస్తవి. ఆకాశ భూతమునకు పూర్వపుదే పరమాత్మ. దానికి కలిగిన స్పందనములో తొలి

వేర్పాటయిన ఆటమే డెవలప్ అయి మానవ వర్గంలో మాస్టరుగా వచ్చిరి. జీవుడుగా వచ్చిన అణువే మాస్టరు. ఆ అణువు అనేకములుగా విడిపోయి అనేక జన్మలెత్తినవి. జంతువర్గములో సింహముగా ఉండిన దాజీవాణువు. ఆ జన్మను వదలినప్పు డుత్పత్తి అయిన అనేకములగు జీవాణువులే ఇప్పటి జన్మమున వారిని చుట్టుకొని ఉన్నవి. కూకటి వేరునుండి వేరుపడిన వేళ్ళు అన్నీ తమ రస గ్రహణమునంతనూ కూకటి వేరు ద్వారానే చెట్టుకు అందజేస్తవి గదా! వారిద్వారానే పరమార్థావిష్కారణము చేయసాగినవి.

తొలుదొల్త తన శరీరమునుండి వేఱయిన యీ అనంతములగు జీవాణువులనెల్ల కూడగట్టుకొని నిర్గుణమయిన తన పరమాత్మను సగుణముగా నామ రూప క్రియాత్మకముగా వెలయించుకొనుటకు యీ పాటంతా పడుతూంది. బ్రహ్మము శబ్దబ్రహ్మమనీ అర్థబ్రహ్మమనీ రెండు విధములు. శబ్దబ్రహ్మము ఆదిలో 'ఓం' కారముగా పుట్టినది. దానిలోనుండి పదములూ భాషలూ వేదములూ ఉపనిషత్తులూ సర్వ విద్యలూ పుట్టినవనీ అనుకొంటున్నాము. శబ్ద బ్రహ్మమే అర్థబ్రహ్మము. వివర్తనము చెందినది. విశ్వసృష్టి జరిగినది. అంటే శబ్దార్థసృష్టి జరిగింది. వాగర్థములు పురాణ దంపతులని కాళిదాసన్నాడు. బాహ్యముగా ప్రపంచము విరివిచెందుతూవుంటే ఆంతరముగా దీనికి విరుద్ధముగా లోనికి వ్రేళ్ల క్రిందికి దిగబ్రాకినట్లు మానవ సంకల్పములు సృష్టిమూలమును గుర్తించుటకు లోలోనికి పోసాగినవి. సృష్టిమూలమును గుర్తించుటకు తొలుత యజ్ఞ యాగాదులు సాగినవి. వానిలో హింస ఉన్నదని దానిని మానేటందుకుగా బౌద్ధమతమూ జైనమతమూ వచ్చినవి. మానవుడై పుట్టడమే పాపమూలకమనీ గార్హస్థ్యమువల్ల సృష్టి పెరుగుతుంది కాబట్టి అది తగదనీ సన్యాసము కావలెననీ బౌద్ధులనిరి. బౌద్ధ సన్యాస సంకల్పమే త్రిమతములవారూ కొంత మార్పులతో పరిగ్రహించినారు. ఆ మాటనేటప్పటికి Separation కు చోటిచ్చినట్లయినది. వెంటనే గార్హస్థ్యముంటేనేగాని realise చేయలేమని ఇంకో వ్యావర్క చేసినది. అనేకులు అనేక విధముల బ్రహ్మమును చూడవలెనని attempt చేస్తూఉంటే వాటిసారమంతా చెట్టులోని యితరవ్రేళ్ళ సారమంతా కూకటివేరు లోనికి పోయినట్లుగా ప్రధానకుండలినిలోనికి పోయివచ్చినది. అట్లాగే అందటి experience యొక్క రిసల్ట్సును ఒక ప్రధానవ్యక్తి పొందుతూండినది.

పరమార్థము లోకాంతరమునగాని పొందటానికి వీలులేదని కొందఱంటూ వచ్చినారు. ఉపనిషత్తులలో కొన్నింట కంటికగుపించిన వెలుగే బ్రహ్మమని ఉన్నది. ఘంటానాదమే నాదబ్రహ్మమని యున్నది. బ్రహ్మమును చూడడమునకు ఇంకా మార్గములను భావించినారు. ఉపనిషత్తులలో అనేక విద్యలున్నవి. అవి అన్నీ పరమార్థమును తెలుసుకోవడానికే భిన్న భిన్న విధముల వెలసిన సాధనములు. ఇంకా హఠ, రాజ, మంత్ర, భక్తి, ధ్యాన, జ్ఞానయోగములని కొన్ని విధానములున్నవి. మంత్రయోగములో శాక్తేయులు మపంచకము కావలెనన్నారు. ఈ విధంగా ఎన్నో జన్మలు పోయినాయి. వాండ్లు పొందినవన్నీ రికార్డుచేయబడి ఉన్నాయి. అందుకే మాస్టరుగారన్నారు. ''ఇదివఱకెన్ని విధములుగు మార్గముల సారమున్నదో దాన్నంతా పాదముక్రింద ఉంచుకొని ఈ Line Start అయినది'' అని.

ఈ line నిశ్చయమేమిటంటే, ఎవరైనా (బ్రహ్మమును) ఈశ్వరుని చూచానంటే వాడూ ఈశ్వరుడుగా మారితేనేగాని అది నిశ్చయముగాదు. మొట్ట మొదట దానిని చూచినవాడే కనపడే ఈశ్వరుడు.

అవతల ఆనందమయమగు స్థితి ఉన్నదనీ, దాన్ని పొందడము కోసము అనేకులు అనేక విధములుగా attempt చేస్తూన్నాము. అంతరంగంగా జరిగే స్థితి అవుటర్‌గా తెలియాలి. ఎవరైనా ఒకరు అవుటర్‌గా రియలైజు చేయగల్గితే బహిరంగంగా కూడా తెలిసేటట్లుండాలి. వాడు ప్రపంచమంతటినీ తనతోబాటు మార్చగల్గి ఉంటాడు. ఈ విధంగా అంతా ఒకటే అనే అనుభవం కల్గితేగాని ఆ స్థితి పొందలేడు.

శుద్ధ ధర్మమండలమని ఒకటి ఉన్నది. దాన్ని అందుకోగల్గితే ఎల్ల దివ్య శక్తులను చూడబడినవగును. ఆ స్థితిని ఈ దేశములోని హిమాలయ వాసులు ఋశ్యశృంగాదులు పొందినారని వినే బ్లావెట్‌స్కీ ఇక్కడకువచ్చి థియసాఫికలు సొసయిటీని స్థాపించినారు. ప్రపంచములోని అన్ని మతాల సారములనూ గుర్తించినారు. వారి రచనలు పరమ ప్రమాణంగా చదువతగినవని శ్రీ మాస్టరు గారు చెప్పినారు.

ఇన్నింటిలోనూ వారున్నారు. థియసాఫికల్ సొసయిటిలో మాస్టరును 'M' అంటారు. వీరొకప్పుడు విక్రమార్కుడు అవి ఎట్లా తెలుసుకోవడము జరిగిందో తర్వాత చెపుతాను.

శుద్ధ సన్యాసిగా ఉండి ధర్మమండలమును చూడడము కుదురలేదు. థియసాఫికల్ సొసయిటీలో రెండూ రెండువిభాగాలుగా - ప్రకృతి పురుషుడూ- వర్క్ చేస్తూ ఉంటే అది రియలైజేషన్‌కు వీలుకాదనీ రెండూ ఒకటి కావాలనీగుర్తించినారు. మాడమ్ బ్లావేడ్స్కీ చాలా దినాలు ఆయనదగ్గఱ హిమాలయాలలో అనేకములగు విషయములను తెలుసుకొన్నది. ఇద్దఱూ ఇప్పుడు భార్యాభర్తలయినారు. అట్లా అయిన తర్వాతనే యీ line 1910 లో Start అయింది. వారిద్దఱికీ మారేజ్ అయి వాళ్ళిద్దఱూ ఒకటి అయిన తర్వాతగాని రియలైజేషన్ కుదురలేదు.

Realise చేసేటందుకు ఒక అణువు చాలదు. Centreలో నుండి (ఒక Point) Start కావాలి. చుట్టూ సర్కంఫరెన్సు ఉండాలి. Centre లేకుండా సర్కంఫరెన్సు ఏమీ చేయలేదు.

ఆ మారేజీ అయిన పిదపటి సంగతి తర్వాత మాట్లాడుదాము.

ఏ feeling మీద నేనిట్లా మాట్లాడుతున్నానో! ఆ మారేజీ అయిన తర్వాత ఆయన రియలైజుచేసిన సత్యమేమిటో తర్వాత:-

శ్రీ ప్రభాకరుల జనకులు వేటూరి సుందరశాస్త్రిగారి కృతి

# కాలకంఠ శతకము

## (గత సంచిక తరువాయి)

సీ. శ్రీ పార్వతీశ నిన్ సేవించగాలేను
తీర్థయాత్రలకేగి తిరుగలేను
పురహర నిన్ను నే బూజింపగాలేను
బుధసేవ సేయనే బోవలేను
ఫాలాక్ష నీ పేరు భాషించగాలేను
(చేరి నీకై) తపము సేయులేను
యక్షరాణ్మిత్ర ని(న్నరసి) చూడగలేను
జన్నంబులను జేయఁజాల నేను
పాతకుడ కుత్సితుండను పాపరతుడ
గాన నా తప్పులెడబాపి కావకుంటె
పట్టుపెట్టెద గట్టిగా వహ్నినేత్ర
కదళిపురవాస ! గౌరీశ ! కాలకంఠ !

సీ. విపుల సంసారాటవిని జిక్కుబడనేల
పంచాక్షరీ మంత్ర పఠనముండ
తాపత్రయా ఘోర దావాగ్ని బడనేల
హర (భక్తిరస) వృష్టి ధరణి గలుగ
పాపాంధకారాది బాధ నొందగనేల
ఫాలాక్షనుతిరవిప్రభలు గలుగ
షడ్వర్గసామజ సమితి (కార్వగ) నేల
(హరనామ హర్యక్ష మండనుండ)
మహిమ గనలేక డోలాయమానమగుచు
(మనసు చెదరుట చూడ) నీ మాయగాదె

సకల గుణభూష! సర్వలోకైక పోష
కదళిపుర వాస! గౌరీశ! కాలకంఠ!

సీ. బాలచంద్రుఁడనైతె భావజాంతక నీదు
శిరముపై నేవేళ జేరియుందు
గజచర్మమైయుంటె గరకంఠ నిన్ను నే
కౌగిలించుక ప్రొద్దు గడుపుచుందు
జింకనై పుట్టితే శంకర నీ చెంత
జేరి చిత్రపు పనుల్ చేసియుందు
గోరాజునై యుంటె కుటిలాక్ష నిన్ను నే
బాయక వీపుపై మోయుచుందు
వ్యర్థమగు జన్మమెత్తిన వాడననుచు
మరువజూచితివేమొ (నామాటకేమి)
భక్తరక్షణ బిరుదు నిన్బాసిపోదె?
కదళిపురివాస! గౌరీశ! కాలకంఠ!

సీ. పుట్టినప్పటినుంచి పుణ్య మేమెరుగను
భిక్షమెవ్వరికైన బెట్టలేదు
దేవాలయంబుల దేరిజూడఁగలేదు
సత్కథాలాపముల్ సలుపలేదు
గురుకులవాసంబు గోరి జేయగలేదు
పుణ్యభూములకైన బోవలేదు
దానధర్మాదుల దలచి చేయగలేదు
శివపూజయైన నే జేయలేదు
కఠినచిత్తుడ కుటిలుడ కానివాడ
హీనమనుజుడనై మదమెక్కి జగతి
దిరుగు చెనటిని; దరిజేర్చుదొరవు నీవె;
కదళిపురవాస! గౌరీశ! కాలకంఠ!

[సశేషము]

# నూతన వర్షము

—వే॥ ప్రభాకరశాస్త్రి కవి

మలయ సమీర సౌరభ సమంచితముల్ సుఖభుక్త మత్త సం
కుల కలకాకలీ కలిత కూజిత కోకిల మంజు గానముల్
దళిత మనోజ్ఞ కుట్మల వితాన లతా నయన ప్రమోద నో
జ్జ్వలములు నవ్యవార్షిక వసంత దినమ్ములు మిమ్ముఁదన్పుతన్ 1

పరిణత చూతపోత ఫలభార పరీత వనాంతముల్ విక
స్వర సరసీరుహప్రకర సౌరభ వారి సుఖావగాహముల్
నిరవధిక ప్రమోద రజనీ సమయంబు లశీర దర్శితా
దరములు నవ్యవార్షికనిదాఘ దినమ్ములు మిమ్ముఁ దన్పుతన్ 2

అవిరళ వారివాహ నివహావృత సర్వనభో విభాగముల్
సువిహిత నృత్యకేకికుల శోభితముల్ పరితస్సరత్సరిత్
ప్రవహణముల్ నిరాకృత దివాకర తీవ్రకర ప్రచారముల్
నవశరదాగమాంబుద దినంబులు మిమ్ములఁ దన్పుఁ గావుతన్ 3

అకలుష వారివాహ కమలాకరముల్ పరిపూర్ణ సస్యస
స్యకలిత భూవిభాగములు స్వచ్ఛనభోంతరముల్ సుభుక్త దై
సుకములు చంద్రికాప్లుతి మనోహరముల్ సకలక్షమాప వా
రకములు నవ్యవర్షిక శరద్దివసంబులు మిమ్ముఁ దన్పుతన్ 4

అమిత హిమ ప్రపాత పిహితావృత భూమి నభోవకాశముల్
ప్రమద విధాయకంబులు యువప్రజ సంశ్రయణీయ గర్భగే
హములు సుధూప రాంకవ పటాద్యవనేయము లప్రవాసి లో
కములు నవీన వర్ష హిమ కాల దినంబులు మిమ్ముఁ దన్పుతన్ 5

లలిత వసంత లక్షణ విలాస సమీప మనోహరంబు లు
జ్జ్వలిత సహస్రభాను కరవారము లాయత రాత్రి భాగముల్
గళిత హిమ ప్రపాత సుభగంబులకాంక్షిత శీత వాతముల్
నలి నవవర్ష శైశిర దినంబులు మిమ్ములఁ దన్పుఁ గావుతన్ 6

—పుట 502. ఆంధ్ర భారతి 1 భాగము - సంఖ్య 12
సాధారణ - పుష్యము (1911)

# సంపాదకీయం

ఆంధ్ర వాఙ్మయ వికాసానికి ఆధునిక యుగాన అపారమైన సేవ గావించిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (1798-1884) దొరగారి నూరవ వర్ధంతి ఈ సంవత్సరమే. అముద్రిత ప్రాచీనాంధ్ర వాఙ్మయాన్ని అమూలాగ్రం పరిశీలించినవారు, బ్రౌన్ వాఙ్మయోద్ధారకులలో ఆద్యులు, ప్రాతః స్మరణీయులు, అయిన శ్రీ ప్రభాకరుల ముప్పైనాల్గవ వర్థంతి కూడా ఇప్పుడే. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని ఆ మహనీయు లిద్దరినీ స్మరిస్తూ మా యీ మణిమంజరి ఎనిమిదవ సంచిక శ్రీ ప్రభాకర - బ్రౌన్ పండితుల కంకితమైన విశేష సంచికగా వెలువడు తున్నది. ఈ హేతువుచేత మామూలుగా సాగే కొన్ని శీర్షికలను ఈ సంచికలో నిలుపు చేసినాము.

బ్రౌన్‌దొర కావించిన భాషా సేవను బాగా గుర్తించినవారు, విశేషంగా ప్రస్తుతించి ప్రకటించిన వారు, పరిశోధనకు ప్రేరణ నిచ్చి, మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారానికి వచ్చి చూచి ప్రస్తుతించండని పాత్రికేయులకూ భాషాభిమానులకూ తొలుత పిలుపిచ్చినవారు శ్రీ ప్రభాకరులు.

ఈ తరం వారిలో చాలా మంది ఇంకా పుట్టి బుద్ధెరగడాని కంటే ఎంతో పూర్వమే ప్రభాకరులు వాఙ్మయ రంగాన గణనీయమైన సేవ చేశారు. వారి కృషి మౌలికమైనదీ, మార్గదర్శకమైనదీ, శ్రద్ధతో పరిశీలించి భక్తితో స్మరించ దగినదీ అన్నది ప్రాజ్ఞులందరూ ఎరిగిన సత్యము.కాని వారికి ఆధ్యాత్మిక జీవితానుభూతి ముందు సాహిత్య వ్యాసంగం ఉప్పన చప్పనగా తోచి ఆనాళ్ళలో వారు ఆ విషయమై అంతగా పట్టించుకోలేదు. చెదురుమదురుగా ఏవో కొన్ని రచనలే వారివి సంకలింపబడినవి గాని ఇంకా ఎన్నో గ్రంథ రూపాన రావలసినవి ఉన్నవి. అట్లే ఇంకా పరిశోధించి వారు వ్రాసి పెట్టిన వ్రాత ప్రతులలోని అనేకానేక విషయాలను విశ్లేషించి విలువ కట్టవలసిన ఆవశ్యకత; వాటినన్నింటిని ప్రభాకర సంపూర్ణ గ్రంథావళిగా ముద్రింపవలసిన అవసరము ఎంతో ఉన్నది. ప్రస్తుతానికి ప్రభాకరులు బ్రౌన్ వాఙ్మయానికి చేసిన సేవను గూర్చి ఒకింత ఈ సంచికలో ప్రకటిస్తున్నాము.

వారు 1911 లోనే మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాన్ని ఆంధ్రప్రజల దృష్టికి తెచ్చారు. మెకంజీ, బ్రౌను చేసిన వాఙ్మయ సేవను ప్రస్తుతించారు. వాస్తవానికి వారే ఆనాటి ఆ లేఖతో (మూ.పు. 15) తెలుగుదేశాన మెకంజీ, బ్రౌను దొరల వాఙ్మయసేవను గూర్చిన పరిశోధనకు నాంది పలికిన వారైనారు. బ్రౌన్ ప్రతిభా విశేషాలు గుర్తించి ఆ పిదప తాము కూర్చిన (మదరాసు ప్రా. లి. పు. భాండాగారం వారి) డిస్క్రిప్టివ్ కేటలాగుల్లో అనేక విషయాలను వెల్లడించారు.

అలాగే బ్రౌనుదొరకు సంబంధించిన సమాచారాన్ని చాలా సేకరించి, ఆయన వాఙ్మయ జీవితాన్ని చిత్రించే ఒక విశిష్ట ప్రతిని సంపాదించి, ఆ రంగాన కృషిచేసిన వారిలోనూ ప్రభాకరులే ప్రథములు.

బ్రౌన్ లేఖల్ని పరిశీలించి వాటిని కొన్నిటిని ప్రకటించి ఆధునిక యుగాన ఆ లేఖలకుగల ప్రాముఖ్యాన్ని గుర్తించినవారిలోనూ ప్రభాకరులే అగ్రగణ్యులు.

“పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేరరాదు నావిరచనలందు డెందము పవిత్రముగా విలసిల్లి సత్య సుందరము పరార్థయుక్తమగు తత్త్వమునే వెలయింప గావలెన్” అన్నదే ప్రభాకరుల నిత్యప్రార్థన. వారి ప్రతిజ్ఞ కూడా అట్టిదే. అందుకే ఆయా ప్రామాణిక విషయాలను ఈ తరం పరిశోధకుల దృష్టికి తేవడమే మా యీ విశేష సంచిక లక్ష్యము.

ఈ మారు పత్రికను వెలువరించడంలో కాస్త జాప్యం జరిగింది. ఎంత ప్రయత్నించినా నగరంలోని అలజడుల కారణంగా అచ్చు పనులకు ప్రతిష్టంభము కలగడం తప్పలేదు. అందుకు మేమెంతో విచారిస్తున్నాము. భావిలో ఇట్టి తొందర లిక కలుగబోవనీ పాఠకులీసారి మమ్ము మన్నించగలరనీ ఆశిస్తున్నాము.

—సంపాదకులు.

- Training for young artistes under eminent gurus by providing scholarships.
- State level music and drama unit to be set up.
- Identification and publication of ancient manuscripts.
- Early completion of the museum of Telugu culture launched in 1975.
- Separate departments for improving "Nadaswaram" in music College.
- Recognition and grants to private music colleges.
- Financial aid to indigent and aged artistes.
- Re-organisation of the activities of different academies.
- Financial assistance to voluntry cultural organisations.
- Celebrations to comm morate the memory of eminent personalities in the field of culture
- Tours of cultural troupes to other states to promote cultural integration and cordial ties.
- Installation of the statue of Lord Buddha and 25 other eminent personalities at the Buddha Purnima Project, Hyderabad.

---

A Government that is dedicated to the revival of Telugu cultural glory.

---

Title printed at Master Art Printers,
1-1-694/2/A Gandhinagar, Hyderabad-500 380.

# TELUGU CULTURE A RENAISSANCE



The Government of Andhra Pradesh under the Stewardship of Sri N.T. Rama Rao, Chief Minister, is dedicated to cherish and nourish, the age-old culture and traditions of the Telugu People and to spread Telugu glory to the four corners of the country.

A number of new schemes have been launched.

- Establishment of Telugu Vignana Peetam.
- A modern auditorium-cum-cultural centre in each district with all amenities.
- Dance, drama and music competitions at district and state levels
- Financial aid to young artistes in different cultural fields.

(...continued in third page cover)

D.I.P.R. Proc. No. 372/Advt. II/C4/84 Dt. 8-8-84